ఓ బ్రహ్మచారి......
నిను కోరి........
నిలుచున్నది చిన్నది నిను చేరి..



పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు
నటించిన చిత్రం

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి

# బ్రహ్మచారి

నిర్మాత: ఎ.వి.సుబ్బారావు
దర్శకుడు: తాతినేని రామారావు

నవయుగ

NVKR

ఫోస్ఫోమిన్, శక్తిని పెంపొం
దించును, ఆకలిని
అధికముచే యును,
సహనశక్తిని
హెచ్చించు
-ను. శరీము యొక్క
రోగనిరోధక శక్తిని
ఎక్కువచేయును




అవును —
కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేటులుగల అనుపమ్మని పండ్ల రుచిగల టానిక్

SQUIBB® TTT®

SARABHAI CHEMICALS

shilpi sc 40/67 Tel

వెండిమబ్బు నవల. నవలా సాహిత్యంలో నందనవన
పారిజాతం! మహోజ్జ్వలమయిన ఆ వెండిమబ్బు
నవలకి ఉదాత్తమయిన చిత్ర రూపకల్పనే





గౌరీ ప్రొడక్షన్స్

# పాలమనసులు

నిర్వహణ: S. భావన్నారాయణ దర్శకత్వం: S.S.R. శర్మ

రాజశ్రీ రిలీజ్

## సీరియల్

సంక్రాంతి సంచికలో "మూడుముళ్ళు" సీరియల్ చాల బాగా ఉంది. శ్రీ అచ్యుతవల్లిగార్కి నా అభివందనములు. కథలో ఒక చిన్న పొరపాటు జరిగింది. శ్రీ అచ్యుతవల్లిగారు నరసయ్య కుటుంబమును వర్ణిస్తూ "నరసయ్యకు ఇద్దరు కొడుకులు అని మొదటవాని పేరు "చిట్టిబాబు" అని అతడు పి. యు. సి. చదువుచున్నాడని, చిన్నవాడు "జగ్గు" అని సెకండ్ ఫారమ్ చదువుచున్నాడని వ్రాసెరు. కాని జగ్గును వర్ణిస్తూ జగ్గు ముద్దుగా బొద్దుగా ఉంటాడు అని జగ్గుకు పది సంవత్సరముల వయస్సు అని వ్రాసెరు. కాని 10 సంవత్సరముల వయస్సులో సెకండ్ ఫారమ్ చదవడము ఎలా వీలవుతుంది? ఇచ్చట ఒక చిన్న తప్పు దొర్లింది అని భావిస్తున్నాను.

డి. పాండురంగం (రంగాపురం)

# ఉత్తరాలు



## పై వారం!

కడుపు తీపి

వ. నిషి



నాన్నారి నడుగు

ఎన్నో ఇతర ఆకర్షణలు!




# ఆంధ్రపత్రిక వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 9-2-'68
శ్రీ ప్లవంగనామ సం॥ మాఘమా॥ శుద్ధ దశమి

సంపుటము: 60 సంచిక: 23

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి. మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన: శ్రీ శేషగిరిరావు.


పాలుపోసినా
ఏడుస్తున్నాడే
పసివాడు
హిందీ
యేతర
ప్రజలు


పరిమితి
రేఖ
స్నేహపూర్వక
సలహా


విచ్ఛిన్న
మైనమిశ్రమ
ప్రభుత్వం
బీహార్
మంత్రివర్గం
ఎ.పి.సిన్హా
విరిగిన బాటుతో
క్రికెట్ ఆడటం
చాలా కష్టం


ఇంకా చాలా
వాటిని అనుస
రిస్తాయి
బెంగాల్
యునైటెడ్
ఫ్రంట్
మంత్రివర్గం
పతనం
బీహార్
మిశ్రమ
మంత్రి వర్గం
పతనం

# విదేశ వ్యవహారాలని విస్మరించి పార్టీ గొడవలలో తలమునకలవుతున్న ఢిల్లీ ప్రభుత్వం

కొన్నిరోజులుగా ఢిల్లీ వార్తాపత్రికలు అమాయకప్రజలకి ప్రధానమంత్రీ, మార్షల్ టిటో వియత్నామ్ సమస్యని చర్చిస్తారని చెపుతున్నాయి. ఇంతలో రష్యా మంత్రివర్గం అధ్యక్షుడు శ్రీ కొసిజిన్ కూడా ఈ చర్చలలో పాల్గొనటానికి నిశ్చయించుకున్నారు. శ్రీ కొసిజిన్ వయసు 64. రష్యా రాయబారవర్గం పంచిపెట్టిన కాగితంలో ఆయన 'వయస్సు ముదిరిన రాజకీయవేత్తలలో ఒకరు' అని ఉంది. మార్షల్ టిటో కూడా వయసు ముదిరిన వ్యక్తే. 'యువరక్తం' అనేమాట ఆయనకి వర్తించదు

శ్రీమతి గాంధీ ఈమధ్య బెల్‌గ్రేడ్, మాస్కోలకి వెళ్ళివచ్చారు; అక్కడ యువనాయకులని మాత్రమే ఉంచుకోమని ఆ దేశాలవారికి సలహా ఇచ్చి ఉంటే బాగుండేదికదా! ఇప్పుడేమో ఆమె ఆలోచనాశక్తి కరుడుకట్టుకుపోయిన వారితో చర్చించవలసివస్తోంది...

## రాష్ట్రపతుల కోరికలు

మార్షల్ టిటోకి స్వాగతం పలుకుతూ భారత రాష్ట్రపతి అమెరికాని వియత్నామ్ మీద బాంబులు వెయ్యటం ఆపమన్నారు. వియత్నామ్, పశ్చిమ ఆసియాలలో శాంతి అతిముఖ్య విషయం అయిపోయింది. భారత, యుగోస్లావియా రాష్ట్రపతులు అమెరికా బాంబులు వెయ్యటం ఆపాలి, ఇస్రాయిల్ ఆక్రమించిన ప్రదేశాలు వదలాలి అన్నారు. శ్రీ కొసిజిన్ కూడా ఇదే కోరిక వెలిబుచ్చవచ్చు.

## నమ్మకాలు

ఒక జాతీయ పత్రిక విలేఖరి ఈ బ్రహ్మాండమయిన వార్తని ప్రకటించారు తమ పత్రికలో—

'ఢిల్లీలోని రాయబారవర్గాలు శ్రీ కొసిజిన్ రాకగురించి ఎన్నో విధాలుగా ఆలోచిస్తున్నారు, ఈ సందర్భాన్నిపట్టి. దేశాన్ని ఎదుర్కొంటున్న అతిక్లిష్టమయిన ఆర్థిక, రాజకీయ సాంఘిక సమస్యలు ఎన్నో; కాని, శ్రీమతి గాంధీ సుస్థిరమయిన ప్రభుత్వాన్ని ఇవ్వగలిగారు. అని ఎందరో నమ్ముతున్నారు.'

ఇలాగే పండిత మదనమోహన మాలవీయా 'మత నిర్ణయం' హిందువుల పక్షం ఉంటుందని నమ్మారు మాజీ మంత్రి చాగ్లా తమ నోరు విప్పగానే ఇస్రాయిల్ భయపడి 1967 జూన్ ముందు ప్రదేశాలకి తగ్గిపోతుందని నమ్మారు. విదేశాంగశాఖమంత్రి వర్గపు 'పురోహితులు' చెప్పేది ఒకటి, కమ్యూనిస్టు వర్గాలు నమ్మేది మరొకటి భారతదేశం అరాజకపు పాలు కాగలదని ఈ వర్గాల నమ్మకం. పయిన చెప్పిన పత్రికా విలేఖరి రష్యన్‌లకి ఏమీ తెలియదనుకుంటున్నట్టుంది. ఆయన అన్న 'ఎందరో నమ్మకానికి' ఆధారం ఏమిటి? ఈ నమ్మకానికి కారకులు ఎవరు? రష్యన్లు మాత్రం కారే! 'ఈ సందర్భం' అనే మాటని పరిశీలించాలి. ఎందుకంటే, శ్రీమతి గాంధీ రష్యా ప్రధాని రాకని ఎదురుచూడలేదు, బెంగాలులో కమ్యూనిస్టులు అసహకారోద్యమాన్ని ప్రారంభించనున్న సందర్భంలో. బెంగుళూరు, హయిదరాబాదు భాష అల్లర్లని, ఉత్తరప్రదేశ్ గొడవలని గురించి నచ్చచెప్పటం ఒకటి, బెంగాలులో కమ్యూనిస్టుల ఎరెస్టులని గురించి నచ్చచెప్పటం మరొకటి. జనవరి 26 వ తేదీన ఉద్యమం మొదలయితే ఎరెస్టులు తప్పవు కదా? శ్రీమతి గాంధీ కొసిజిన్ సరిగ్గా 'ఈ సందర్భంలో' వచ్చి దిగుతారనుకుని ఉండరు.

## రష్యా ఆమోదం?

జూదంలో కాసిన పందేల విలువ పెరిగి పోయింది. ఆమె చెప్పిన ప్రకారమే బెంగాలు గవర్నర్ శ్రీ ధర్మవీర కొన్ని చర్యలు తీసుకున్నారు. ఇక వెనక్కితిరగటం అసంభవం. హయిదరాబాదు సమావేశంలో కాంగ్రెసు ఇతర పార్టీలతో చేతులు కలిపి ప్రభుత్వాలలో పాల్గొనటానికి నిశ్చయించుకుంది. ఈ నిశ్చయం శ్రీమతి గాంధీకి తెలియనిది కాదు. ఇప్పుడు వెనక్కి తిరగటం వీలవుతుందా? ఆమె బెంగాలు ప్రభుత్వంలో జోక్యం చేసుకుంటే కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారు ఆమోదించకపోవచ్చు. ఆమె, 'ప్రపంచ బాంకు ఆజ్ఞమీద రూపాయి మారకం విలువ తగ్గించారన్నారు, ఇప్పుడు రష్యా ఆజ్ఞల మాటేమిటి?' అనే ప్రశ్నని ఎదుర్కొనవచ్చు.

## నవ్వుల పాలు

ఇంకొక విషయం. విదేశాంగ వ్యవహారాల మంత్రి ఆయన అనుచరులు విదేశ రాయబారవర్గాలవారు తెలివి లేనివారనుకొనవచ్చు. కాని, వారుమాత్రం శ్రీమతి గాంధీ వియత్నామ్, పశ్చిమ ఆసియాలలో శాంతి నెలకొల్పుతానంటే నవ్వుకుంటారు. ముందు 'ఆమె దేశంలో శాంతి, భద్రతల మాటేమిటి?' అనుకుంటారు.

## బ్రిటన్ నిష్క్రమణ

'371 సంవత్సరాలలో ఒక ద్వీపరాజ్యం తిరిగి ఒక ద్వీపరాజ్యం అయింది.' బ్రిటన్ ప్రధానమంత్రి ఈవారం చేసిన ప్రకటనని ఈ విధంగా వర్ణించవచ్చు. 31-10-1600 నాడు ఎలిజబెత్ రాణి I ఈస్టిండియా కంపెనీకి భారతదేశంలో వ్యాపారంచేసేందుకు అనుమతి ఇచ్చింది. 31—10—1971కి ఆఖరి బ్రిటిషు సైనికుడు ఆసియావి

వదిలి ఇంటికి వెళ్ళిపోతాడు. సూయజ్ నదికి తూర్పున బ్రిటన్‌ప్రభావం పూర్తిగా తగ్గిపోతుందన్నమాట.

1947 లో భారతస్వాతంత్ర్యమే దీనికంతా కారణం అని గొప్ప చెప్పుకున్నాడు ఒక టెలివిషన్ వ్యాఖ్యాత ఢిల్లీలో. ఢిల్లీలో ప్రభుత్వం పార్టీలోని గొడవలలో మునిగి ఉంది. విదేశ వ్యవహారాలని గురించి ఆలోచించేది ఎవరు?

చరిత్రని తిరగవేసి చూస్తే ఇటువంటి పరిస్థితులు చాలా కనిపిస్తాయి. బ్రిటిషు నావికదళమే మన్రో సిద్ధాంతాన్ని నిలబెట్టింది; 1961లో బ్రిటిషు సేనలు లేకపోతే ఇరాక్ కువెయిట్‌ని ఆక్రమించుకునేదే; 1963-64లో ఇండొనేసియా మీద పడకుండా కాపాడినవి బ్రిటిషు సేనలు; 1964 లో టాంగనీయకా, ఉగాండా, కెన్యాలలో తిరుగుబాటునుంచి ఆ దేశప్రభుత్వాలని రక్షించినవి బ్రిటిషు దళాలే; జర్మనీ, జపాన్‌ల విశేషార్థికాభివృద్ధికి అమెరికా బలమే కారణం; బ్రిటిషు సేనలు ఖాళీచేసిన తర్వాత భారతవాణిజ్యం భవిష్యత్తు ఏమిటి?

1962లో 'పంచశీల' మిథ్యతోబాటు భారతదేశపు ఆర్థిక సుస్థిరపరిస్థితి కూడా దెబ్బతిన్నది. ఏదేశమూ రక్షణబలం లేకుండా ఉండరాదనే సంగతి తేటతెల్లమయింది, ఈ బలం ఒక్కరోజులో నిర్మించేదికాదనీ తెలిసిపోయింది.

### భారతదేశం కర్తవ్యం

బ్రిటన్ వదిలిన జాగాలోకి ఎవరు రావాలి? అమెరికా అంత సుముఖంగా లేదు. అంటే, కమ్యూనిస్టు చెయినా కాని జపాన్ కాని రావచ్చునన్నమాట. ఆగ్నేయాసియా నిండా చెయినా వారు ఉన్నారు. దీనిని మరిచిపోకూడదు. చెయినా అంతర్యుద్ధం తీవ్రంగా ఉన్నప్పటికీ ఈ ప్రాంతంలో పాశ్చాత్యదేశాల బలం తగ్గిపోతే శ్రీ మావ్ ఊరికే ఉండకపోవచ్చు.

ఇక జపాన్ సంగతి— జర్మనీపట్ల తూర్పు యూరపులో ఎంత భయం ఉందో ఈదేశంపట్ల ఆగ్నేయాసియాలో అంత భయమూ ఉంది, రెండవ ప్రపంచయుద్ధం ధర్మమా అంటూ. జపాన్ కూడా యూరప్, అమెరికాలతోనే సంబంధ బాంధవ్యాలు పెంపొందించుకున్నది. యుద్ధంముందూ, తర్వాత కూడా ఈ ప్రాంతంపట్ల అహంభావంతో ప్రవర్తించింది. ఇక్కడ 'సీటో' బలం ఉంది. అది 'నాటో'కి తోడుకాగలదే కాని బదులు కాలేదు. జర్మనీకి ద్రవ్యోల్బణం అంటే అతిభయం. అయినా చెయినా కన్నా జపానే మెరుగు కావచ్చు.

ఈ సందర్భంలో రష్యా పాత్రనికూడా పరిశీలించాలి. రష్యాకి ఆసియాలో 'పెట్టుబడి' చాలా ఉంది. రష్యా క్రమంగా అమెరికా వయిపుకి మొగ్గుతోంది. స్కాండినేవియన్ ఎయిర్ సర్విస్ వారు రష్యా ఆసియా భాగాలమీదుగా విమానాలు నడుపుతున్నారు—మాస్కోని బాంగ్‌కాక్‌ని తమ సర్వీసులతో కలుపుతున్నారు. రష్యాలోని ఆసియా భాగాల అభివృద్ధికి జపాన్ సహకారంకోసం మంతనాలు జరుగుతున్నాయి. అంటే, రష్యా ఇనపతెరవెనుక దాక్కోటం లేదన్నమాట.

భారతదేశం నాయకత్వం వహించే అవకాశం ఉంది—దేశనాయకులు తమ స్వలాభాలని గురించి మాత్రం ఆలోచించటం మానివేస్తే. మాజీ ఆర్థికమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి ఒకసారి భారతదేశం—ఆస్ట్రేలియా—జపాన్‌ల మధ్య మైత్రిని ప్రతిపాదించారు. ఇటువంటి మైత్రిని రష్యా, అమెరికాలు కూడా ఆమోదించక మానవు. జపాన్‌పట్ల ఉన్న అపోహలుకూడా పోవచ్చు.

ఆగ్నేయాసియాలోని చిన్న దేశాలు త్వరలో సమావేశమయి తమ విధానాలని గురించి చర్చలు జరుపుకుంటాయట. మలేసియా ప్రధాని తమదేశం, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లు కలిసి 'స్పష్టంగా, నిదానంగా,' అన్నివిషయాలూ ఆలోచించటం మంచిదన్నారు. ఆస్ట్రేలియా ప్రధానమంత్రి బ్రిటన్ ఖాళీని తమ దేశం నింపలేదన్నారు. భారతదేశం మాట్లాడటం లేదు. మనని అక్కడికి ఎవరూ ఆహ్వానించలేదు. కారణాలు అందరికీ తెలిసినవే. పశ్చిమ ఆసియాతో భారతదేశం ముడిపడిపోవటం మరొక కారణం.

ఢిల్లీలో జరుగనున్న 'యు. ఎన్. సీ. టి. ఎ. డి' సమావేశంతో భారతదేశానికి మంచి అవకాశం. ఆ అవకాశాన్ని భారతదేశం ఉపయోగించుకొనగలదో లేదో పయివారంతో తెలిసిపోగలదు. ●

ఈవ్స్ వీక్లీ మరియు మెస్సర్స్ సాహెబ్ సింగ్స్ సంయుక్తంగా నిర్వహించిన 'మిస్ మద్రాస్ అందాలపోటీ'లో హైద్రాబాదు నిజాం కళాశాల విద్యార్థిని మిస్ యాస్మిన్ 'అందగత్తె'గా నిర్ణయింప బడింది.

మిస్ యాస్మిన్ నిజాం కళాశాలలో



పెద్ద పెద్దపూలు, డిజయిన్లు, ప్రింట్లు వున్న బట్టలు కట్టుకోటం చాలమందికి సరదా. ఎంత దూరాన్నుంచయినా మనుష్యుల్ని యిట్టే ఆకర్షించవచ్చు. ఈ మధ్య వచ్చిన సింతటిక్ కలర్స్' ద్వారా వివిధ రకాలయిన 'షేడ్స్'లో విచిత్రమయిన డిజైన్స్ మార్కెట్‌లోకి వచ్చాయి. ఇవి అన్ని తరహాల వారిని యిట్టే ఆకర్షిస్తాయి. అవును మరి! అంతంత పెద్దపూలు ఆమాత్రం ఆకర్షించకపోతే ఎలా?





మినియుగం. తక్కువ బట్టలో ఎక్కువ ఆకర్షణ. ప్రస్టేకింగ్‌గా వున్నప్పుడే డిజైన్స్ అంతే మరీ ఆకర్షణ. 'డ్రెస్' అంత ప్రస్టేకింగ్‌గా వున్నా లేకపోయినా 'మినిస్కర్ట్' అంటే రోడ్డు మీద జనం వెర్రిగా మాత్రం చూడటం మాయం. మనవాళ్ళు అలా చూడకుండా వుండే స్థితికి వచ్చేసరికి మళ్ళా ఎనిమిది గజాల చీరలు వస్తాయేమో. ఫాషన్ పునరావృతం అవుతుంది కదా మరి.

ఫైనల్ బి. ఎస్. సి. చదువుతూ వుంది. ఇంతకు ముందెప్పుడూ యిలాంటి 'అందాల పోటీ'లో పాల్గొని వుండలేదు. నాటకానుభవం మాత్రం వుంది. ఈమె తండ్రి

<—ప్రైవేట్ సెక్రటరీలు బాస్ దగ్గర ప్రెట్టీగా వుంటే పని ఆహ్లాదకరంగా జరుగుతుంది. ప్రింట్ డిజైన్స్‌లో యీమధ్య ఓరియంటల్ డిజైన్స్ మొదలుకొని 'ఏబ్‌స్ట్రాక్ట్' దాకా తయారవుతున్నాయి. అమెరికాలో ప్రింట్స్ కోసం తయారుచేసిన ఇండియన్ హేండ్‌లూమ్స్ ఎక్కువగా అమ్ముడవుతున్నాయట. ఫాషన్ వాళ్ళగి బట్ట మనది. అది ఒకందుకు మంచిదే. ఫారిన్ ఎక్స్‌చేంజి దొరుకు[illegible]

హైదరాబాదులో ఒక వ్యాపారి. ఈమెకు ముగ్గురు సహోదరులు వున్నారు.

మిస్ మద్రాస్‌గా నిర్ణయింపబడ్డ యాస్మిన్‌కు మద్రాసు గవర్నరు సతీమణి శ్రీమతి ఉజ్జల్‌సింగ్ వెయ్యిరూపాయల లొకెట్ బహుమతిని, విలువయిన ఆభరణాల్ని, రకరకములయిన దుస్తుల్ని 'ఈవ్స్ వీక్లి—సాహబ్‌సింగ్స్' సంస్థల తరఫున కానుకగా యిచ్చి 'మిస్ మద్రాస్' కిరీటాన్ని యాస్మిన్ శిరస్సుపై అలంకరించారు.

ఈ పోటీకి, న్యాయనిర్ణేతలుగా శ్రీ ఏ. ఎల్. శ్రీనివాసన్, శ్రీ మరుతు పిళ్లె (మాజీ కార్పొరేషన్ మేయరు) గాక మరి ముగ్గురు ప్రముఖులు వ్యవహరించారు.

'మిస్ మద్రాస్'గా నెగ్గిన యాస్మిన్ బొంబాయిలో జరుగనున్న 'మిస్. ఇండియా' పోటీలో పాల్గొంటుంది. ●

పోటీలో ప్రదర్శించిన కొన్ని రకాల ఫాషన్‌లను బొమ్మలలో చూడవచ్చు. —సం.

●

బొమ్మలు : మనోహన్‌దత్.



'ఆబ్‌స్ట్రాక్షన్' కేవలం ఆర్ట్‌లోనేకాదు. అన్నిటిలోనూ [illegible] జాస్తయింది. ఈ స్వెట్టర్ మీద డిజైన్ అబ్‌స్ట్రాక్ట్ పెయింటింగ్‌కి ఎంత మాత్రం తీసిపోదు. ఎంత దూరానవున్నా కంటిని యిట్టే ఆకర్షించటానికి అంతంత లావు నల్లని సున్నాలు ఎంతో ఉపయోగపడతాయి. చూపు వలయం దాటిపోయినా చుట్టూవున్న నల్లపట్టీల్ని తప్పక ఆపుతాయి. అంటే చూసేవాళ్ల కళ్లు ఎంతకీ స్వెట్టరులోనే తిరుగుతూ వుంటాయి, రంగులరాట్నంలా. జాగ్రత్త. యీ హడావిడిలో మీ పనులు మర్చిపోయేరు.



↞—007 జేమ్స్‌బాండ్ సీక్రెట్ సర్వీస్ కథలు, సినిమాల వ్యామోహం పెరిగిపోవటంతోపాటు చలివున్నా లేకపోయినా స్వెట్టర్ స్ట్రైప్ బట్టల డిమాండ్ పెరిగిపోయింది. క్రింద స్ట్రైప్స్ అయినా పైన లూజు స్వెట్టర్ తమాషాగానే వుంటుంది. చూస్తుంటే చెప్పకుండా చూడబుద్దేస్తుంది.

↞—బివేర్ ఆఫ్ యాక్సిడెంట్స్.

---

ఆది హరిహరుడు పాలిస్తున్న కాలం. అతని రాజధానిపేరు కుంజరకోణపురి. దీనినే ఆనెగుండి అని కూడా అనేవారు. ఒకనాడు వేటాడుతూ రాజుగారు తుంగభద్రనిదాటి, దాని దక్షిణతీరంవిూద ఉన్న మహారణ్యాన్ని ప్రవేశించాడు. వేటకుక్కలు ఒక కుందేలు వెంటపడ్డాయి. హటాత్తుగా కుందేలు ఎదురు తిరిగి కుక్కలనే కరిచింది!

వేట ముగిసినతర్వాత రాజుగారు వెనక్కి వెళ్లిపోయారు. దారిలో 'విరూపాక్ష' వద్ద ఉన్న విద్యారణ్య స్వామిని సందర్శించుకుని జరిగినదంతా చెప్పాడు.

'రాజా! ఆస్థలం ఒక మహారాజ వంశానికి నిలయమయి ఉండతగ్గది. అక్కడ ఒక నగరాన్ని స్థాపించు. దానిని విద్యకేనగరం కానీ! భారతదేశానికే వన్నె తీసుకురానీ!' అన్నాడు స్వాములవారు.

1336లో హరిహరుడు నెలకొల్పిన విద్యానగరం వెలసిల్లింది. ఆనాటి అమరానగరమే నేటి హంపీ శిధిలాలుగా మారిపోయింది.

హరిహరుడు విద్యారణ్యస్వామిని తన కులగురువుగా, మంత్రిగా చేసుకున్నాడు. ఆయన విద్యాశంకరుడనే గొప్ప ఆచార్యుని శిష్యుడు; శృంగేరీ గురు పీఠాధిపతి. గురువులాగే విద్యారణ్యస్వామికూడా అద్వైతి. ఆతని చుట్టూ ఎందరో పండితులు గుమిగూడారు. ఋగ్వేదానికి వ్యాఖ్య తయారుచేసినది వీరే. వీరి కృషి వర్ణనాతీతం.

క్రమంగా విద్యానగరం, విజయనగరం అయింది. ఒకవిధంగా విజయనగర మహాసామ్రాజ్యస్థాపకులలో ఒకరు విద్యారణ్యస్వాములవారే!

—ఎవ్

### ఒకవారం విపరీతం

# ప్రాణత్యాగం

ఇంగ్లండులో ససెక్స్‌లో ఒక సముద్రంలో వచ్చిన ఉప్పెనలో చిక్కుకున్న తోటి విద్యార్థిని రక్షించ డానికి తన ప్రాణాలు త్యాగంచేసిన విద్యార్థి భారతీయు డని తేలింది. తోటి విద్యార్థిని రక్షిస్తుండగా తను నిలుచున్న ప్రదేశం కూలిపోయి ఆ భారతీయ విద్యార్థి అగాధంలో పడి పోయాడట.

*   *   *

కోయంబత్తూరులో కొత్తగా కట్టిన ఒక సినిమా హాలు ఉపప్రధాని శ్రీమొరార్జీ దేశాయ్ యీనెల 20వ తేదీ 11-15కు ప్రారంభోత్సవం చేయా



అనగా, కచ్చితంగా 11—05కి మూడువేల మంది హిందీ వ్యతిరేకులు హాలుముందు పోగై పోలీసువారు వారించినా వినకుండా ''హిందీభూతం'' అని అరుస్తూ రాళ్ళురువ్వారట— హాలుమీద. లాఠీ చార్జీలు, భాష్పవాయుప్రయోగం అవిగాదుగ పరిస్థితి కాల్పులవరకూ వెళ్ళింది. చూస్తుండగనే వేల యీనిసంఖ్య పదివేలమంది పోగయ్యారట. ఈ కొట్లాటలో దెబ్బలు తగిలిన పోలీసుబలగం సంఖ్యలు తెలియలేదు కానీ, అవతలవైపు వారి సంఖ్య తెలియలేదట ఇంకా.

అంతటితో అయినా అది ఆగలేదు. 22, 23 తేదీలు కూడా పూర్తిగానే వుందట. 23వ తేదీన ఒక ఒక్కనికి పెట్రోలు పోసి నిప్పంటించారట. రాళ్ళు రువ్వడం, అరవడం అనేది కనీస ధర్మమై పోయింది. లాఠీలతో, రాళ్ళతో, భాష్పవాయువులతో, అరుపులతో పోలీసులు—వ్యతిరేకులు(?) దాగుడు మూతలు ఆడుకుంటున్నారట— అరే....ఇదంతా అవ్యవస్థేనా.




## సముద్రంలో పడ్డ ఎగిరే వస్తువు?

19వ తేదీన కనీవినీ ఎరుగని ఒక అద్భుతమైన వస్తువొకటి గగనంలోంచి వాషింగ్టన్‌లో సముద్రంలో పడిందట. అది తన నుంచి సుమారు మైలున్నర వరకూ కాంతులు విరజిమ్ముతోందట. అయితే వెళ్ళి, దాన్నిపట్టుకోవాలంటే, సముద్రం కొంచెం వుధృతం తగ్గాలని అన్నారు. బైనాక్యులర్స్‌కి అది అనుతోంవని, ఎన్నడూ, ఎవరూ చూసినదీ, విన్నది కాదని అన్నారు—అదేవిట చెప్మా!

## నూనె శుద్ధి కర్మాగారంలో ప్రేలుడు

ప్రపంచంలోకల్లా పెద్దదయిన ఆయిలు రిఫైనరి ''రాటర్‌డామ్'' అనేచోటవుంది. ఆ రిఫైనరిలో ఏదో ప్రేలి, వచ్చిన మంటల మూలంగ ఇద్దరు భస్మమైపోయారని, 60 మంది క్షతగాత్రులయ్యారనీ తేలింది. ఆరిఫైనరి చాలాభాగం కాలిపోయిందట —పాపం!!

## నిధి వసూలుకి వెళ్తే గాయాలు

కలకత్తా సమీపంలో మానిక్‌టాల్ అనేచోట సరస్వతీపూజకి నిధివసూలు కని బయలుదేరిన వారికి, ఆవూరి వారికి జరిగిన సంఘర్షణలో 10 మంది తీవ్రంగా గాయపడ్డారు— ఇది జనవరి 21వార్త.

*   *   *

బిలాసపూర్ ప్రాంతంలో మంగేలి అనేచోట హరి [illegible] మంది చనిపోయారని, 15మందికి పైగా తీవ్రంగా గాయాలు తగిలివుంటాయనీ వార్త!

## పరహృదయంతో జీవనం

కాలిఫోర్నియాలో మైక్ కాస్‌పెరాక్ అనే ఆయన తన 'ఎరువుగుండె'కు స్వస్తిచెప్పి 14 రోజుల అనంతరం యీనెల 21న చనిపోయాడట. కేప్‌టవున్‌లో డాక్టర్ బ్లైబర్గ్ అనే ఎరువుగుండెతో జీవిస్తున్న వ్యక్తి యింకా సజీవుడుగానే వున్నాడట. ఇప్పటికి ఎరువుగుండె పెట్టించుకున్న వాళ్ళు నలుగురు. వీరిలో చాలా ఎక్కువకాలం (18రోజులు) బ్రతికి, చనిపోయిన లూయిస్ వాష్‌కెన్‌స్కీని అధిగమించి, యింకా యాయన సజీవంగానే వున్నాడట.

## హొంగల్ కానుక యువ్వనుడుకు కత్తిపోటు

కె. యస్. కుంచితపాదం అనే కాంగ్రెసు కౌన్సిలరును 22వ తేదీన ఒక కిళ్ళీషాపు వద్ద నిష్కారణంగా ఎవరో బాకుతో పొడిచి పారిపోయారట. ఈ సందర్భంలో 29ఏళ్ళ ఆరుముగం అనే అతన్ని అరెస్టు




చేశారు. పోలీసురక్షణ యివ్వలేదని పొరపాటని కొందరన్నారు. అంతచిన్న కారణంతో ఎవరైనా హత్యచేస్తారా అని మరికొందరన్నారు—కుంచితపాదం ఆసుపత్రిలో వున్నారు.

# పాతనాగలి స్థానే ట్రాక్టర్

అవును, ఇతర ఉపకరణములు కూడా. ఇంకా చాలమంచి ఎరువులు మరియు విత్తనములు. వ్యవసాయమును ఆధునిక మొనర్చుటకు, పంటలవృద్ధికి మరియు దానిని ఇతర ఆర్థికరంగముల కనుగుణ్యంగా నుంచే నిమిత్తం రైతుకు ఇవన్నియు కావలెను.

విరివిగా వ్యాపించియున్న కార్యాలయముల ద్వారా వ్యవసాయాభివృద్ధికి, భూముల శ్రేయస్సుకు, నీటి సరఫరా సౌకర్యములు మరియు యంత్ర సహాయముల నిమిత్తం స్టేట్ బ్యాంక్ ధనసహాయం చేయుచున్నది. తోటపనులు, విత్తనాల తల్లేనారు మళ్లు, పశువృద్ధి కృషి, పాడి ఉత్పత్తి కృషి, కోళ్లపెంపు, చేపలపెంపు కృషి. మరియు వంటతోటలు. వీటికి కూడా బ్యాంకు ధనసహాయము చేయును

## స్టేట్ బ్యాంక్ సేవ నిమిత్తం



# మూన్ రేకర్ -19

## జేమ్స్ బాండ్ బొమ్మల సీరియల్










రాకెట్ వెళ్లింది. గాలాని గట్టిగా పట్టుకున్నాను...

పేలుడుకి హూనం అయిపోయాము....డ్రాక్స్ ఆఫీసులో మిగిలిన భాగంలోకి ఎగిరి పడ్డాము....

ఇంతలో రాకెట్ ఆకాశంలోకి 300.....500... 1000 మైళ్ళు ఎగిసుకు పోయింది.









గుడ్విన్ శాండ్స్ ఉత్తరాన నావికదళాలు గస్తీ కాస్తున్నాయి. అక్కడ రవాణా లేకుండా ఏర్పాట్లు చేశారు....

— అదుగో ఆ సబ్మెరైన్ ప్రమాదంలో ఉంది! హెచ్చరిక చేస్తూ ఒక షాట్ మీదుగా వదలండి.....










ఈ షాట్ కి సమాధానంగా జలాంతర్గామి రష్యన్ పతాకం ప్రదర్శించింది-

రాడార్ తెరల మీద మూన్ రేకర్ రాకెట్ భూమి వైపు ప్రయాణం తెలుస్తోంది...

....పతాకందింపి మునిగి పోయింది....










చానెల్‌లో ఒక రష్యన్ సబ్మెరైన్ లోపలికి వెళ్లిపోయింది. సర్ హ్యూగో (డ్రాక్స్) రాకెట్ లండన్ మీద పడ్తోంది అనుకున్నాడు.......

కాని, నాకూ గాలాకీ మాత్రమే అది, సముద్రంలో, ఎక్కడ పడుతుందో తెలుసు.....

—అదే ఆ సబ్ సరిగ్గా టార్గెట్ ప్రదేశంలో ఉందని 'ఎస్డిక్' చూపిస్తోంది!










1000 మైళ్ళు పైన మూన్‌రేకర్ రాకెట్ గంటకి 10000మైళ్ల వేగంతో తిరిగివచ్చేస్తోంది!

సర్‌హ్యూగో(డ్రాక్స్) తను రష్యన్ జలాంతర్గామిలో సురక్షితంగా ఉన్నాననుకుంటున్నాడు, తనని రాకెట్ స్థావరంనుంచి తీసుకుపోయిన జలాంతర్గామి!

కాని, తన రాకెట్, పరమాణువు కొనగలది, సబ్మెరైన్ దిగినచోట, చానెల్‌లో పడింది.










చానెల్ పేలుడుతో పెద్ద జలకంపం ఏర్పడి హాలండ్‌తీరం అంతా 'తడిసి' పోయింది.

రెండు నావికదళం గస్తీ పడవలు బోల్తా కొట్టాయి.....

డ్రాక్స్‌నీ, అతని ముఠావారినీ సురక్షితంగా తీసుకుపోయిన జలాంతర్గామి సముద్రంలో 180 అడుగుల లోతులో పడి ఉంది.

(ఇంకా ఉంది)

**పి. కె. వి, మాచ్‌ఖండ్**

భర్త అనురాగానికీ, ఆదరణకీ నోచుకోని స్త్రీ జీవితం ఏమికావాలి రామలక్ష్మిగారూ?

ఏ కథలోలా— చెల్లాయి!

**వి. శ్రీకాకుళం**

మంచిదైనటువంటి, నిర్మలమైనదటువంటి గుణము, మనస్సు, హృదయాన్ని చూడకుండా డబ్బును, పైమెరుగులను చూసి ప్రేమించి ఆరాధించే స్త్రీలని ఏమనాలి?

ఏమీ అనక్కరలేదు. మంచి మనస్సు, హృదయం యిత్యాదులు బాగనే ఉంటాయి గాని జీవితం సాఫీగ నడవాలంటే డబ్బుకూడా కావాలిగా.

**ఎ. ఎస్, చేర్యాల**

మీ దగ్గిరకు ఎక్కువ ప్రశ్నలు వస్తే ఒక పేజీకంటె ఎక్కువస్థలం కేటాయించుతారా అక్కయ్యా?

ఇప్పుడు రావడం లేదనా తమ్ముడూ, వరదాగా చెప్పుకునేటికి ఒక పేజీ చాలు.

**వి. ఆర్. ఎల్, విజయవాడ**

ఆడవారికి పుష్పాలన్నా, ఆభరణాలన్నా ఎందుకంత మక్కువ?

ఆడవారు కనుక అలంకరణ వస్తువులంటే మక్కువ ఎక్కువగా ఉండడం సహజం.

**ఎస్. ఎం. కె. ఎం, హైదరాబాదు**

నాకు చిన్నప్పటినుండి తిండి తప్పించి ఇంకేమీ చేయలేదు నా తల్లి తండ్రులు నా అభివృద్ధికి కారకురాలొక ధనికురాలు. ఇప్పుడు 400 సంపాదిస్తుంటే తమని నా దగ్గిరే పెట్టుకోమంటారు. ఆమె నన్ను తన దగ్గిరే ఉండిపొమ్మంటూంది.

ఇది లోకనీతిగా తోస్తుంది. చేతికి అందవచ్చిన కొడుకుని ఏ తల్లి తండ్రీ చూస్తూ చూస్తూ వదలరు- తాము వాని అభివృద్ధికి దోహదం చేశామా లేదా అన్న ఆలోచన వారి కుండదు. కొడుకు సంపాదన తమ హక్కు భుక్తం అనుకుంటారు.

**బి. ఆర్, కొత్తగూడెం**

డిటెక్టివు నవలలు చదివితే విజ్ఞానం వస్తుందంటారు కదా. మా అక్కయ్య ఎప్పుడూ వాటిని చదువుతుంది. కాని ఇంట్లో పనిచెయ్యదు ఎందుచేత?

విజ్ఞానం ఉంటే గాని ఇంట్లో పనిజరగదా ఏం? చేయడానికీ చదువుకోడానికీ సంబంధం లేదు.




**సిహెచ్. ఎస్, వినుకొండ**

ప్రతి హృదయంలో సి. వి. మా. అనే మూడు అక్షరాలు యిమిడి ఉంటాయి ఎందుకు?

ఎవరు చూసి చెప్పారుట!

**ఎం. ఎస్. ఎన్. ఆర్, బెస్తవారపేట**

అక్కయ్యా, భర్తలను లెక్కచేయక ఇష్టమొచ్చినట్టు తిరిగే ఆడవాండ్లను ఏమనాలి? ఏంచేయాలి?

ఆది ఆ భర్తల తలనొప్పి తమ్ముడూ, నీకెందుకు?

**యు. సి. కె, ఆదోని**

మనదేశంలో బీదవానికంటే భిక్షగాడే మేలంటాను.

నిజమే. వీడి వెళాదాయంకంటే వాడి దినాదాయం మెరుగు!

**ఎస్. ఏ. ఎస్. సలాహ్, కలికిరి**

జీవితమనెడి ముళ్ళబాటలో నడువలేక విసిగి వేసారిన మనుష్యులకు తరుణోపాయం సన్యాసమా? మరణమా?

రెండూ కాదు. ముళ్ళబాటలోనే నడవడం నేర్పు అలవరచుకోవడం.

**డి. ఆర్. జి, చిత్తూరు**

పెద్దలు ఇతరులకు ధర్మసూత్రాలు బోధిస్తూ, చివరకు వారే అధర్మాలకు లొంగిపోయి నీతిని నిజాయితిని వెంటపాలు చేస్తారెందు కక్కయ్యా.

నీతి నిజాయితీలు బోధించినంత సులభంగా పాటించడం కష్టం కనుక తమ్ముడూ.

**వి. వై. జి, వరంగల్**

మనస్సు పరిపరి విధాల ఎందుకు పోతుందక్కయ్యా?

మనసు గుర్రపు కళ్ళేలు నీచేతులో సరిగా పట్టుకోక తమ్ముడూ.

**పి. ఐ. కె, నిజామాబాద్**

'నా భార్య గొప్పరచయిత్రి కాకపోయినా ఆమె వ్రాసినవి పుస్తకాలలో పడడం వల్ల గొప్ప రచయిత్రినని అహంకారం ఎక్కువ. నాకు దూరంగా ఉంటుంది. ఆమెకు విడాకులిచ్చి వేరే వివాహం చేసుకోవాలనుకుంటున్నాను.

అహంకారం ఉన్నవాళ్ళు గొప్పవాళ్ళెలా అవుతారు? పేరు ప్రఖ్యాతులకీ సాంసారిక జీవితం సాగించడానికీ సంబంధం లేదు. మీ ఆవిడ మిడి మిడిజ్ఞానంతో బాధపడుతున్నారు. ఓపిక పట్టండి.

**ఎం. ఎస్, పాలకొల్లు**

నా వయస్సు పదిహేడు సంవత్సరాలు. ప్రతి చిన్న విషయానికి నా మనస్సు విపరీతంగా బాధ చెందుతుంది. ఎప్పుడూ ఏదో విచారంగానే ఉంటుంది. నా మనస్సుకు శాంతి కావాలి. అదెలా చేకూరుతుంది?

దీనికే 'గ్రోయింగ్ పెయిన్స్' అంటారు సోదరీ, కొంచెం ఓపికపట్టు.

**ఎం. ప్రకాష్, కరీంనగరు**

మనుష్యులు దూరం అయితే మనసులు దూరం అవుతాయా?

అదేమా? దగ్గిరవుతాయని కదా భాష్యకారుడు చెప్పాడు..

**సిహెచ్. ఆర్. ఎల్. డొంకరాయి**

నేను చాలా గారాబముగా పెరిగాను. ఇప్పుడు కాపురానికి వచ్చి నడుచుకొనుట తెలియక బాధపడుతున్నాను. మీ సలహా ఏమిటి?

అభ్యాసము కూసువిద్య అని చిన్నప్పుడు కాపీ రాయలేదా? చేస్తూ ఉంటే అదే వస్తుంది.

**వై. కె, హైదరాబాదు**

ఏమండీ, మనం చేయుచున్నపనిపై ఇష్టములేనప్పుడు ఏమి చేయాలి? మాని వేయవలసినదేగదా?

తప్పనిసరైతే ఇష్టం తెచ్చుకుని చేయక తప్పదు గదండీ.

**కె. వి. ఎల్. ఎన్, భవానీపాట్నా**

మీరు జవాబులిస్తూ మగవాళ్ళను దుయ్యపడతారని, స్త్రీ పక్షపాతి అని ఒక స్నేహితుడు అంటాడు. మీ కలాంటి భేదాభిప్రాయాలు లేవంటాను నేను. ఎవరిది నిజం?

చదువుతూనే నన్ను అడుగుతారెందుకు?

# తలనొప్పి?



# అవేదన్



## తీసుకొని చిటికెలో పోగొట్టండి

SQUIBB

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం. దీని క్రింద ఉపయోగదారులు కరంచంద్ ప్రేమచంద్ ప్రయివేట్ లిమిటెడ్





ఆశ్చర్యకరమైన "ఎపెప్" కల అవేదన్ తలనొప్పి, జలుబు, ఫ్లూ ఇతర శరీర నొప్పులను త్వరగా, సురక్షితముగా, నిశ్చయముగా నివారణచేస్తుంది.

Shilpi SC 51A/67 Tel



'కృష్ణా!'

'అన్నయ్యా! ఆ క్షణంలో అన్నయ్యను అక్కడ చూడడంతో నా మనసు ఊయల లూగింది

వరండాలో వాలుకుర్చీలో కూర్చున్న వాడు లేచి నన్ను కౌగలించుకొన్నాడు అన్నయ్య — నేను గుమ్మంలోకి అడుగు పెట్టడంతోనే

'ఏరా ఇదేనా రావడం?' వాడు అడిగిన దానికి 'ఊఁ' అని 'మరి నీవు ఎప్పుడు వచ్చావురా' అని అడిగాను

'రెండురోజులైంది' అని 'ఇందూ' ఎవరొచ్చారోచూడు .. చెల్లెలిని పిలిచాడు అన్నయ్య

చేతులు తుడుచుకొంటూ వస్తూనే అంది ఇందిర. 'చిన్నన్నయ్యా వచ్చావా... వంటింటివద్ద కాకి అరవడంతో 'ఎవరో వస్తారనే అనుకొంటున్నాను నీవు వచ్చావు'

ఇందిర మళ్లీ అంది. నేనేదో చెప్ప బోయేంతలో,

'పెద్దన్నయ్య ఒక్కడే వచ్చాడు నువ్వూ ఒక్కడివే వచ్చావు ... ఏమిటో ఈ మగాళ్లు' ఇందిరమాటల్లోనిష్ఠూరం

'వదినను ఎందుకు తీసుకురాలేదు అన్నయ్యా' అడిగింది.

'ఓ అదా ఏంలేదు ' నవ్వాను.

'సుమిత్ర వాళ్లన్నయ్య ఇంటికి వెళ్లిం దేమో.' అన్నయ్య అందుకొన్నాడు నవ్వుతూ.

'ఎంతైనా మీరు మగవాళ్లులెండి ఎన్నైనా చెపుతారు.' మగవాళ్ల మనస్తత్వాన్ని ఇందిర ఎత్తి చూపుతుంది.

ఇకఅసలు విషయం దాచడం అనవసరం అనిపించింది

'ఇందూ! మీ సుమిత్ర వదిన అంటుంటుంది — ఇక్కడికివచ్చి చాలా రోజులైందని ఇక్కడికి రావాలని ... కాని నేను ఆఫీసుపనిమీద మద్రాసువెళ్లి వస్తున్నాను. అందుకే వదినను తీసుకురావడం పడలేదు. పిల్లలూ అత్తయ్యను కలవరిస్తున్నారనుకో.'

'ఆ సంగతి ముందే ఏడ్వరాదూ..' నవ్వు దాచుకొంది ఇందిర

'అన్నాలు తిందురుగాని పిద్దండండి' అని లోపలికివెళ్లి పోబోయి వెనక్కు తిరిగి అంది 'పిల్లలు వచ్చేవేళ అయింది. ఈరోజు వాళ్లకెంతో సంబరం చిన్న మామయ్యతో కలిసి తింటామని.'

ఇందిర లోపలికి వెళ్ళిపోయాక అన్నయ్య వంక చూశాను ... కాని, వాడు ఇందిర వెళ్ళినదిక్కే చూస్తున్నాడు.

పన్నెండు గంటలు కొట్టేటప్పటికి పిల్లలు వచ్చారు.

'చిన్నమామయ్య వచ్చాడు ... బలే బలె' అనుకొంటూ ఇంట్లోకి అడుగు పెట్టారు...ఇద్దరన్నచేతులు పట్టుకొని వచ్చిన విజయ వాళ్ళచేతులు విడిచి గబగబా నాఒళ్ళో చేరింది... 'బొమ్మలు తెచ్చావా' అంటూ.

'ఈసారి తేలేదువిజ్జీ' అబద్ధమాడాను దాన్ని ముద్దుపెట్టుకొంటూ. 'ఎందుకు తెలేదు...'బుంగమూతి పెట్టింది ఎనిమిది ఏళ్లవిజయ. 'విజ్జీ! నువ్వు బాగా చదువు కొంటున్నావా మరి?'

'చూడు! ఎన్ని పుస్తకాలో' అంటూ బ్యాగ్‌లోనుండి దాని నాలుగో తరగతి పుస్తకాలు అన్నీ తీసి పెట్టింది.

నాకు నవ్వు వచ్చింది.

'అన్నయ్యా! ఎన్నిపుస్తకాలుంటే అంత చదువని మన విజ్జి భావనలా ఉంది' అన్నాను;

అన్నయ్య సమాధానంగా నవ్వాడు.

'చిన్న మామయ్య' దగ్గరికి వచ్చాడు రాజు—పెద్దోడు.

'నీ పుస్తకాలు చూపిస్తావా ఏమిటి' అడిగాను.

'కాదు మామయ్యా! నాకు మొన్న పరీక్షలలో ఎన్నిమార్కులు వచ్చాయను కొన్నావు... చూడు' అంటూ తన ప్రోగ్రెస్‌కార్డు చూపించాడు.

రాజు ఏడవ తరగతి చదువుతున్నాడు.

'లెక్కల్లో వందకి వంద రావాలన్నా వుగా...' అంటూ రెండవాడు రాఘవ తన లెక్కల పేపరు చూపించాడు.

'చాల్లెండి మీ ప్రతాపాలూ మీరూను. భోజనాలకి కదలండి.' ఇందిర వచ్చిలంది.

'చెప్పుకోనీ వాళ్లను...' అన్నాడు అన్నయ్య.

'అవునుమరి... చిన్నమామయ్యతోకాక పోతే ఇంకెవ రితో చెప్పుకొంటారు ? ఏవేవో మంచి వస్తువులు అవీ ఇస్తాడని వాళ్ళఆశ...' అని ఇందిర లోపలికి వెళ్ళి పోయింది.

నేను తెచ్చిన వస్తువులు ఇస్తున్న వాడినల్లా వెనక్కు తిరిగి అన్నయ్యవైపు చూసాను...

అన్నయ్య కళ్లల్లో ఓ క్రొత్తభావాన్ని చదువుకొన్నాను. ఇందిరమాటల్లో అర్థం విచిత్రంగా స్ఫురించింది నాకు — మొదటి సారిగా!

'ఈ చీర మద్రాసునుండి తీసుకు వచ్చాడు మా చిన్నన్నయ్య ... బాగుంది కదండీ.'

'మరి వీగా పెద్దన్నయ్య ఏవీగా తేలేదా?'

'తేకేమండీ ... తెచ్చాడు' చిన్నన్నయ్య తెచ్చేవాటిముందు అవి ఎంతండి? ... ఎంతైనా ఆ బందరునుండేగా...'

— ఇందిర పక్కింటి ఆవిడితో అంటున్న మాటలు వినిపించేటప్పటికి నిద్రమత్తుపోయింది ... 'ఇందిరేనా ఇలా మాట్లాడుతుంది?' అనిపించింది

అన్నయ్య ఇంకా పండుకొనే ఉన్నాడు.

'ఇంకా నయం, వాడు విన్నాడు కాదు' అనుకొన్నాను...

గడియారం మూడుకొట్టింది...

'చిన్న మామయ్యా!' అంటూ గదిలోకి వచ్చిన రాఘవ నేను లేచి ఉండటం చూచి, 'పెద్ద మామయ్యా! కాఫీవేళ అయింది... అమ్మ లెమ్మంటుంది' అని వెళ్ళిపోయాడు.

అన్నయ్య లేచి ఎటో చూస్తున్నాడు !

నాకు అర్థమైంది ... నేను అను కొన్నట్టు వాడు నిద్రపోవడంలేదని. వాడి కళ్లల్లోని భావాన్ని నేను ఎక్కడ చదువు కొంటానోనని ముఖాన్ని అటు త్రిప్పు కొన్నాడు! అన్నయ్య మారిపోయాడు! లేక పోతే నాలోకి ఎందుకు ధైర్యంగా చూడ లేడూ!

ఇందిర మారిపోయింది!

విజయ 'ముఖాలు కడుక్కొన్నారా మామయ్యలూ...కాఫీ తెస్తున్నాను' అని వచ్చినట్టే వెళ్ళింది...

'అన్నయ్యా! కళ్యాణి బాగా చదువు తుందా' అన్నాను...మాటల్లోకి దింపాలని.

'నీ తెలివి తేటలేదానికీను...చదివినట్టే కనబడదు...కాని అందరూ మెచ్చుకొం టారు—దాని చదువుకు ... ' అన్నయ్య చెప్పకుపోతున్నాడు. అలా చెప్తున్నపుడు వాడి కళ్లల్లో వెలుగు నిండింది ... ఒక్కగా నొక్క కూతురు పైకి వస్తుం దని.

'కృష్ణా! సాయంత్రం బస్సుకి వెళ్ళి పోతున్నానురా...' ఉన్నట్టుండి అన్నాడు అన్నయ్య...

'ఇవ్వాళే?' — రెండు రోజులుంటానన్న వాడు అప్పటికప్పుడే ప్రయాణ మవు తున్నాడు! వాడి మనస్సు గాయపడినట్లు కనబడుతోంది!

'బందరు నేనూ వద్దామనుకొంటు న్నాను...ఎల్లుండి వెళ్దాంరా' అన్నాను.

'లేదురా కృష్ణా! వెళ్ళాలి...' అని ఆగిపోయాడు.

నేను వాడి ముఖంలోకి చూస్తూ కూర్చున్నాను.

కొన్ని క్షణాల తరువాత అన్నాడు 'మీ వదినకు ఏమీ బాగోలేదు...'

'వదినకు ఒంట్లో బాగోలేదా, చెప్పావు కాదే? అయితే నేనూ వస్తాను ... ఇవ్వాళే వెళ్దాం...'

'ఎందుకురా ... నిన్నే గుడివాడ వెళ్ళి ఉంటుంది...' అన్నాడు అన్నయ్య.

'అక్కడకు నువ్వు వద్దురా' అన్న సూచన వాడి మాటల్లో ఉంది!

'ఇందిరా!...' పిలిచాను...

'విజయ ట్రేలో కాఫీ ఫలహారాలు తెచ్చింది...వెనకే ఇందిర వచ్చింది.

'చూసావా, ఇందూ! అన్నయ్య సాయంత్రమే వెళ్ళిపోతాడట! మనం అందరం కలుసుకొని చాలా రోజులైంది ఇలా ఒక్కింట్లో. అప్పుడే వెళ్ళిపోతా డట...!' నేనింకా పూర్తిచేయలేదు.

'అన్నయ్యకు ఏం పని ఉందో ఏమో...' అని ఇందిర అనేటప్పటికి నేను ఇంకేం మాట్లాడలేక పోయాను!

* * *

అన్నయ్యను బస్సు ఎక్కించేటప్పటికి అయిదు గంటలైంది. వాడు ఎక్కిన బస్సు కదిలింది ... బస్సు వెళ్తుంటే రేగిన దుమ్ములో అది కనుమరుగై పోయే వరకు, అందులో ఉన్న అన్నయ్యని తలుచు కొంటూ నిలబడిపోయాను...

నా మనస్సుకెందుకో 'అన్నయ్య అక స్మాత్తుగా వెళ్ళిపోవడం' బాధ అనిపిం చింది... అంతటికి కారణం ఇందిరేనా?

కొండ మీద వెలిసిన కళ్యాణ దేవత కనకదుర్గమ్మ గుడి కనిపించింది. గుడిలో

గంటలు మ్రోగుతున్నాయి.

కొండ మీద దేవత—మానవులను మాన వులుగా బ్రతకాలని దీవిస్తుంది! క్రింద గలగలా పారేటి కృష్ణవేణి!

దేవతను దర్శించి, కృష్ణమ్మ చల్లని ఒడిలో కాసేపు తల దాచుకొందామనిపించి కృష్ణ ఒడ్డువైపు నడిచాను.

కృష్ణ నిండుగా పారుతుంది...

గుడిలో గంటలు వినిపిస్తున్నాయి...

ఇసుక తిన్నెలలో ఎందరో మను ష్యులు!— పెద్దలమాటలు, వయసువారి తీయని కబుర్లు, పిల్లల కేరింతలూ వింటున్నట్లు కృష్ణ అలలు లయ బద్ధంగా శబ్దం చేస్తున్నాయి!

ఆ అలల శబ్దంలో చిన్ననాటి స్మృతులు!

ఇలాగే గలగలా పారేటి గోదావరి!

ఇందిర, అన్నయ్య, నేను ధవళేశ్వరం ఆనకట్ట మీద ఆడుకొనే వాళ్ళం ... ఇసుక తిన్నెలలో గుజ్జనగూళ్లు కట్టే వాళ్ళం...అవి అన్నాచెల్లెళ్ల మధ్య అను బంధంతో కట్టే దేవాలయాలు అనే వాళ్ళు చాలామంది మా అన్యోన్యతను చూసి...గోదారమ్మ చిలికిన నీటి తుంపరలు మా మీద పన్నీటిజల్లు! రాళ్లను తాకుతూ వింత సంగీతాన్ని ఆలాపిస్తూ పారేటి గోదారమ్మని చూస్తూ కేరింతలు కొట్టే వాళ్ళం...

# గ్రహణం

కాటన్ మహాశయుడు కట్టిన ఆన కట్టను చూపిస్తూ 'అన్నయ్య! నీవు పెద్ద ఇంజనీరు కావాలి' అనేది ఇందిర... అన్నయ్యను ఉద్దేశించి

'మరి తమ్ముడో' అనేవాడు అన్నయ్య.

'నువ్వేమవుతే నేనూ అదే రా, అన్నయ్యా' అనేవాడిని.

'ఇందిరమ్మ ఏమవుతుంది?' నవ్వేవాడు అన్నయ్య.

'అబ్బో! మా అన్నయ్యలు గొప్పోళ్ళు అవుతే నాకు చాలదా, ఏమిటీ?' నవ్వేది ఇందిర...

అమ్మ, నాన్నలు మా మాటలు వినే వాళ్ళు... 'అన్న చెల్లెల మధురాను బంధాన్ని నిర్మించుకొంటున్నారు...ఇలాగే చిరకాలం బ్రతకండి పిల్లలూ...' అనే వాళ్ళు...

ఆ ఏడాది ఎండలకు ఎండిపోయింది గోదావరి...దూరంగా సన్నగా పారుతోంది...

ఎండిపోయిన గోదావరి నిండుతనాన్ని ఎప్పుడు సంతరించుకొంటుందా అని ఎదురు చూసేవాళ్ళం...వానలు కురవాలి... గోదావరి నవ్వాలి... మనుషులు బ్రతుకులు పండాలి!

ధవళేశ్వరం ఆనకట్ట మీద పరుగులు తీసిన రోజులు ఎన్నో గడిపోయాయి. ఇసుక తిన్నెలలో దొర్లిన రోజులు ఇట్టే వెళ్లిపోయాయి!

తెల్లని నల్లని మబ్బులు కూడబలు క్కొంటున్న రోజులు! రేపో మాపో వాన కురవాలి... బీడువారిన నేలను తడుపు కొంటూ ఉరకలు వేస్తూ గోదారి పారు తుంది. అలల సంగీతం పైరు వాళ్ళ పాటలలో కలిసిపోతుంది ... ఆ దృశ్యాలను, బడికి వెళ్తున్నప్పుడు వచ్చే టప్పుడు చూడాలని మా ఆశ—ఎప్పటిలాగే!

మా ఇంటి ప్రక్కనే ఒక గుడి ఉంది...అది ఇంచుమించు చిన్న కొండ మీద ఉంది...గుడి ప్రాంగణంలో నుండి చూస్తే గోదావరి విశ్వరూపం కనబడు తుంది...

గుళ్లోకెళ్లి పూజారి పెట్టిన ప్రసాదం తిని గుడి ప్రాకారంలో కాసేపు ఆడు కొన్నాం ఆరోజు...

నెలవంకకు స్వాగతం పలికి, తను శెలవు తీసుకొన్నాడు సూర్యుడు.

ఆటల్లో మునిగిపోయిన వాళ్ళం — చీకటి పడుతుండనగానే ఇంటికి బయలు దేరాం — కాగితాలతో ఏమేమి పడవలు చేయాలో అని మాట్లాడుకొంటూ...రేపు వర్షం వస్తుంది. పేపర్లో వేసారు...మా ఇంటి ముందు నుండే చిన్న పిల్లకాల వలా వర్షం నీరు ప్రవహిస్తుంది...దానికి గమ్యం గోదావరి. మా కాగితం పడవలు అసలు పడవలు దగ్గరికి వెళ్లిపోతాయి... ఏమిటో అనుకొన్నాము.

ఇంటికి వచ్చేటప్పటికి అమ్మ ఏడుస్తూ కనిపించింది!

పడక కుర్చీలో పడుకొని పేపరు చదు వుతూ ఉండవలసిన నాన్న అక్కడ లేరు!

దేవుడి గదిలో వెలగవలసిన దీపం, హాలులో పడుకోబెట్టిన నాన్న తల దగ్గర ఉంది! అంటే నాన్న దేవుడి దగ్గరకు వెళ్లి పోయాడు!

ఆ ఏడు ఎండిన గోదావరి నిండింది. కాని, కాని, మా బ్రతుకుల నావ తల క్రిందులైంది!

అమ్మకు మిగిలింది మేము ముగ్గురం! కొన్ని రోజులు బ్రతకడానికి నాన్న పని చేసిన పేపరు మిల్లు నుండి వచ్చిన డబ్బు మిగిలింది. అంతకు మినహా మరేమీ వెనకలేదు! బంధువులున్నారు మాట వర



# సైంటిస్టులు

## నొప్పిని అతి శీఘ్రంగా తొలగించునట్టి విధానమును

# కనుగొన్నారు




# మైక్రోఫైన్డ్ 'అస్ప్రో'

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మీ సమస్య:** "అస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైన్డ్ అస్ప్రోను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రోఫైన్డ్ అంటే ఏమిటి:** మైక్రోఫైన్డ్ అంటే, అస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము ముప్పది రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది:** క్రొత్త మైక్రోఫైన్డ్ అస్ప్రోలోని చురుకైన, పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 5 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువల్లనే, మైక్రోఫైన్డ్ అస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము:** క్రొత్త మైక్రోఫైన్డ్ అస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అల్లాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లతో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రోఫైన్డ్ 'అస్ప్రో'ను వాడండి:** నొప్పి, తలనొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతుగనొప్పి.

**మోతాదు:** పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు: ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'అస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీరు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రోఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతి, క్రొత్త మైక్రోఫైన్డ్ అస్ప్రో. బిళ్లలోను ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, ఇది అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును

క్రొత్త మైక్రోఫైన్డ్ 'అస్ప్రో', నొప్పిని, నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము









మైక్రోఫైన్డ్

**అస్ప్రో**

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

నికోలస్ (ప్రై) లిమిటెడ్ ఉత్పత్తి

ACA.O'7E

# గ్రహణం

సకు. అంతే!

ఆర్థిక పరిస్థితి వలన నేనూ, ఇందిరా చదువు మానివేయవలసి వచ్చింది... పడవల రేవులో చిన్న పనికి కుదిరాను!

అప్పుడప్పుడూ ఏడ్చేవాడిని... 'అమ్మా నేనూ చదువుకొంటా'నని

'కృష్ణుడా! శ్రీనివాసు అన్నయ్య ఉద్యోగం చేసినప్పుడు మళ్ళీ బడికి వెళ్దువు గానిరా...' ఓదార్చేది అమ్మ

పడవల రేవుకు వెళ్ళినప్పుడు 'ఇక నేను చదువుకొంటానో, లేదో' అనిపించేది ... రాత్రి అన్నప్పుడు రాలే కన్నీటి చుక్కలు గోదావరిలో కలిసిపోయేవి!

అన్నయ్య అంటుండేవాడు...'కృష్ణా! నేను ఇంజనీరు కాకపోయినా, నేను ఉద్యోగం చేసాక నువ్వు చదువుకొని కాటన్ దొరలా అవుదువుగాని' అని. ఆ వయస్సులోనే అన్నయ్యకు బ్రతుకు అర్థమైంది!

'మనిద్దరం అవుతే ఎంత బావుణ్ణురా' అనేవాడిని.

వాడు నవ్వేవాడు!

మా ఇద్దరి చేతులు పట్టుకుని గుడిమెట్లు ఎక్కే ఇందిర, ఆడిపాడే ఇందిర అమ్మకు తోడుగా ఉండేది!

నాన్న పోయిన రెండు సంవత్సరాలకే అన్నయ్య ఎస్. ఎస్. ఎల్. సి. పాసయ్యాడు. వాడికి వచ్చిన మార్కులు చూసి హెడ్‌మాష్టరు మురిసి పోయాడు.

కాని కాలం నవ్వదు!

ఫలితం అన్నయ్య చదువు అంతటితో ఆగిపోయింది. ఖాదీ సంస్థలో చిన్న ఉద్యోగం దొరికింది. అదే మా పాలిట అదృష్టం!

మళ్ళీ ఇందిరా, నేనూ స్కూలుకు వెళ్ళేవాళ్ళం.

మేము చదువుకొనే రోజులలోనే అమ్మ — తాను ఈ లోకంలో ఎక్కువ రోజులు ఉండనని అనుకున్నదేమో, మా ఇంటిలో దీపం వెలిగించేందుకు — అన్నయ్యకు పెళ్ళి చేసేసింది.

అమ్మ నాన్న దగ్గరకు వెళ్ళిపోయాక మంచి వదినే మాకు పెద్ద ఆడదిక్కు!

రోజులు గడుస్తునే ఉన్నాయి...

అన్నయ్య బలమే మాకు ఆధారం! అందుకని ఇందిర చదువు స్కూలుఫైనల్ తోనే ఆగిపోయింది...ఓ మహనీయుని దయ వలన నేను ఇంజనీరునయ్యాను!

ఇందిరకు పెళ్ళి అయ్యాక బెజవాడ వెళ్ళిపోయింది.

అన్నయ్యను బందరు వేసారు...

మంచి ఉద్యోగం వస్తే నేను హైదరాబాదు వెళ్ళిపోయాను.

నేనూ ఒకింటి వాడినయాను...ఎవరి సంసారాలు వాళ్ళకు ఏర్పడ్డాయి ... కాకపోతే మా సంసారాలు చూడడానికి అమ్మ, నాన్నలు లేరు. ఇందిరను చూడాలన్నప్పుడు వచ్చిపోతుండే వాడిని. అదీ అంతే.

కాని ఇలా అన్నయ్యను ఇందిర ఇంట్లో చూడడం చాలా రోజులకు ... ముగ్గురం కలవడం చాలా అరుదు వాడొచ్చినప్పుడు నాకు వీలుపడదు. నాకు వీలుపడినప్పుడు వాడికి శలవు దొరకదు...ఈరోజు కలవడంతో సంతోషిస్తుంటే వాడు వెళ్ళిపోయాడు, నేను వచ్చిన కొన్ని గంటలకు!

భుజంమీద ఎవరో చేయి వేసేటప్పటికి ఉలిక్కిపడ్డాను. కృష్ణ అలలు కళ్ళముందు కదులుతున్నాయి. ఆ అలల ముందు బావ సారధి!

'కృష్ణా! ఏమిటీ పరధ్యాన్నం' అన్నాడు సారధి.

'బావా! నువ్వా! ఇక్కడికి ఎలా వచ్చావు? నేనిక్కడ ఉన్నానని నీ కెలా తెలిసింది?'

'ఇంటికి వెళ్ళగానే నీవు వచ్చావని ఇందిర చెప్పింది. సంధ్యవేళ కృష్ణ ఒడిలో కూర్చుని మనం ఎన్నిసార్లు కబుర్లు చెప్పుకో లేదూ. అందుకే యిక్కడికి వచ్చాను' అన్నాడు సారధి.

'అన్నయ్య నేను రాగానే వెళ్ళిపోయాడు...'

'శ్రీనివాసు వెళ్ళిపోయాడనేనా నీబాధ.'

'అవును సారధీ! అంతా అయోమయంగా ఉంది. ఇందిర మారిపోయింది. దాని ప్రవర్తన నాకేమిటో కొత్తగా కనిపిస్తుంది. లేకపోతే—ఎన్నాళ్ళకో ఒక్కచోట ముగ్గురం కలిసాం—ఎందుకు వెళిపోతాడు?'

'కృష్ణా! శ్రీనివాసు వెళ్ళిపోవడమే మంచిదైంది...'

'సారథీ !'

'మనిద్దరి మధ్య వున్న చనువుతో చెప్తున్నాను కృష్ణా! నా భార్యమీద నేనే చెప్తున్నందుకు నీవు ఆశ్చర్యపోవద్దు...' బావ గొంతులో బాధ—ధ్వనించింది.

నేను అతని కళ్లల్లోకి చూస్తూ వుండిపోయాను...

..'ఇందిర డబ్బున్నవాళ్లనే గౌరవించడం నేర్చుకొంది. నువ్వు వచ్చేవంటే దానికెంతో సరదా. ఎందుకూ? దానికిష్టమైనవి, ఖరీదైనవి తెస్తావు. నీవు డబ్బున్నవాడవు...అదే మీ అన్నయ్యవస్తే ఏదో చుట్టం వచ్చినట్టుంది ... అతడు తెచ్చేవి ఎంతో చులకనగా కనిపిస్తాయి! చెల్లెలిమీద అనురాగం అను, వచ్చినప్పుడల్లా ఉన్నదాంట్లోనే ఏదో ఒకటి తేకుండా రాడు శ్రీనివాసు.

ఒకసారి—నీవు వచ్చి వెళ్లిన మరునాడే శ్రీనివాసు వచ్చాడు...ఆరోజు ఇందిర ప్రవర్తన వాడు జన్మలో మర్చిపోడేమో!

'మీ వదిన పంపించింటూ' ఓ చీర అవీ ఇచ్చాడు

అవి తీసుకొని ఇందిర లోపలికి వెళ్లి, 'ఈ చీర ఎంత బావుంది...' అంటూ వచ్చింది.

పేపరు చూస్తున్న శ్రీనివాసు చెల్లెలి మురిపాన్ని కళ్లారా చూద్దామని తల ఎత్తాడు!

'హైదరాబాదునుండి తెచ్చాడు, ఇది—చిన్నన్నయ్య...ఈ హారంకూడానూ...'అంది ఇందిర.

శ్రీనివాసు కళ్లల్లో నీళ్లు తిరిగాయి! ఆ నీటితెరల వెనుక ఇందిర అర్థం చేసుకోలేని భావం !

ఆ సాయంత్రమే వెళ్లిపోయాడు శ్రీనివాసు...ఊహించుకో కృష్ణా! కాలం తెచ్చిన మార్పు! అన్నా చెల్లెళ్ల అనుబంధాన్ని డబ్బుతో కొలుస్తుంది!

అర్థమైంది...'ఇందూ! ఎంతమారి పోయావు?' నా మనసు ఆక్రోశిస్తుంది!

బావ మళ్లీ అన్నాడు.

'...అయినా చెల్లెలిమీద మమకారాన్ని చంపుకోలేక వస్తూనే ఉంటాడు—ఊరకే రాక ఏదో తీసుకువస్తూనే ఉంటాడు. ఇవ్వాళ ఇద్దరన్నదమ్ములు కలుసుకొన్నారు. మీ ఇద్దరి అంతస్తుల తరతమ్యాలను మీరిచ్చేవాటితో పోల్చి పక్కింటావిడకి చెప్పుకొంది! అదే మీ అన్నయ్య భరించలేకపోయాడు. ఇంకా ఏమి వినవలసి వస్తుందోనని వెళ్లిపోయాడు. అంతే కృష్ణా! ఏ మనిషి అయినా అంతేనేమో. తనను ఇంకొకడి ఎదుట తేలికపరిస్తే భరించలేడు!'

'ఇందిర మనస్సుకు మసిపూసుకొంటుంది' అనుకొన్నాను.

'చీకటి పడింది...ఇంక ఇంటికి వెళ్దాం పద కృష్ణా !' అని సారథి లేచాడు. అతడు బాధపడుతున్నాడు — తన భార్య ఇద్దరన్నయ్యలకు చూపే భేదానికి.

చీకటిని కప్పుకొని కృష్ణ పరుగెడుతూంది--ఆ రాత్రికి!

చీకటిని నింపుకొని ఇందిర బ్రతుకుతూంది...ఎంతవరకు!

ఆలోచిస్తున్నాను.

ఇంటికి వచ్చేటప్పటికి పిల్లలు పోట్లాడుకుంటున్నరు,...

'చిన్నమామయ్య తెచ్చిన విమానం, గిరగిరా తిరిగే ఈ బొమ్మ మావి' అని రాఘవ రాజులు.

'అమ్మా! చూడమ్మా! పెద్ద మామయ్య తీసుకువచ్చిన మట్టిబొమ్మలు నాకట...నాకేం వద్దు...' తల్లితో విజయ ఫిర్యాదు.

'పోనీలేవే...చిన్న మామయ్య వచ్చాక అడుగుదువుగాని' అని ఇందిర.

'ఊహూ! నాకు ఆ గిరగిర తిరిగే బొమ్మే కావాలి...' విజయ పెంకితనం మట్టిబొమ్మలపై చూపించింది...అవి నా కాళ్లదగ్గరికి వచ్చిపడ్డాయి!

'ఒరే రాఘవా, రాజా! దాన్ని ఆడుకోనివ్వండిరా' తల్లి తీర్పు!

'చిన్న మామయ్య...' నన్ను చూసిన విజయ అంది.

ఇందిర కుర్చీలోంచి లేచి వచ్చింది.

'ఏరా అన్నయ్యా! ఇంతసేపు ఎక్కడికి వెళ్లావు...కబుర్లు చెపులా మనుకొంటే అలాగే వెళ్లిపోయావు...' ఇందిర అంటూంది.

ఇంకొకప్పుడైతే చెల్లెలి ఆప్యాయతకు మురిసిపోయేవాడిని. కాని ఇందిర మనుష్యులను ప్రేమించడంలేదు!

'త్వరగా భోజనాలు కానివ్వండి.

# గ్రహణం

ఏదన్నా ఆడుకొంటూ కబుర్లు చెప్పు కొందాం...' లోపలికి వెళ్లింది.

విజయ, రాఘవ, రాజులు వాళ్ల ఫిర్యాదులు చెప్పుకొంటున్నారు!

సారథి నావంక చూసాడు 'అర్థమయిందా' అన్నట్లు.

నా మనస్సు ఓ నిర్ణయానికి వస్తూంది.

* * *

'ఇందిరా !

...ఒక్కసారి మన చిన్ననాటి ముచ్చట్లను గుర్తుచేసుకో ఇందూ! ఆ జ్ఞాపకాలు నిన్ను వెంట తరిమితే నువ్వేస్థితిలో వున్నావో అర్థం చేసుకొంటావు...

మా యిద్దరి చేతులుపట్టుకొని గుడి మెట్లు ఎక్కుతున్నపుడు ఏమనేదానివి... 'శ్రీ అన్నయ్య, కృష్ణ అన్నయ్య! మీ ఇద్దరూ నా రెండు కళ్లు! ఇద్దర్నీ నా కళ్లల్లో నింపుకొని లోకాన్ని చూస్తాను...'

ధవళేశ్వరం ఆనకట్టమీద ఆడుకొంటున్నపుడు 'అన్నలూ! మీ ఇద్దరూ గొప్పవాళ్లు అయితే నాకు చాలదా?' అనే దానివి. చిలిపిగా అన్న ఆ మాటల్లో 'గొప్ప' అనే పదానికి 'డబ్బున్నవాడు' అనే అర్థం చెప్పుకొంటున్నావా, ఇందిరా! అనురాగం, ఆప్యాయత—ఇవి అన్నీ డబ్బు ముందు ఏమీ కావని నేర్చుకొన్నావా ?

అన్నా - చెల్లెళ్ల మధురానుబంధంతో పెనవేసుకొన్న మా యిద్దరి చేతులు పట్టుకొని పరుగెత్తినదానవు. ఇప్పుడు అన్నయ్యచేతినివదిలేసే మనస్తత్వం ఎందుకు అలవరచుకొన్నావు చెల్లీ! అన్నయ్య నాలాగ డబ్బు కురిపించడు లేదనా? మమతామృతాన్ని కురిపించే అన్నా వదినలను ఎందుకు దూరం చేసుకొంటున్నావు!

మన చిన్ననాటి ఆటపాటలనుచూస్తూ మురిసిపోయిన గోదావరమ్మ, ఇప్పుడేమనుకొంటుందో తెలుసా!—'ఇంతేనా వీళ్ల అనుబంధం అని.

ఇందూ!

అమ్మ, నాన్నలు పోయాక మనకు చెప్పుకోదగ్గ బంధువులులేరు. నీకు, నేను అన్నయ్య...మాకు నీవు. అంతే! మనం ఒకరికొకరం. మనం అన్నా చెల్లెళ్లం. ఆ భావమే మనకు ఆనందానుభూతి! ఆ అనుభూతినే తన మనసునిండా నింపుకొని అన్నయ్య మన నింతవాళ్లని చేసాడు. వాడు పెద్ద ఇంజనీరు కాకపోయినా వాడికి బాధలేదు. నాలోనూ, బావలోనూ తన కోరిక తీర్చుకొన్నాడు!

'మా ముద్దుల చెల్లెలు' అని నీ ఇంటికి వస్తుంటాము.

కాని నీవు ఇద్దరన్నలతో అనుబంధాన్ని వాళ్ల అంతస్తులతో కొలుస్తున్నావని ఇవ్వాళ అర్థమయింది. ఎంత మారిపోయావు ఇందిరా!

నీ ప్రతి మాటలోనూ వాడిని తేలిక పరుస్తున్నావని—అందులోనూ ఇంకో అన్న ఎదుట —వాడు తెలుసుకొని భరించలేక పోయాడు! అందుకే వెళ్లిపోయాడు. వాడి మనస్సు నలిగిపోతుంది ఇందూ!

నువ్వు ఏ అంతస్తుల అనుబంధాన్ని సృష్టిస్తున్నావో అక్కడికే నీ పిల్లలను తీసుకు వెళ్తున్నావు! వాళ్లకి చిన్న వయస్సులోనే డబ్బును గౌరవించాలని నేర్పుతున్నావు! అన్నయ్య తెచ్చిన మట్టి బొమ్మలు విసిరికొడితే నువ్వు మాట్లాడక ఊరుకొన్నావు... ఆ సంఘటన అన్నయ్య చూడకుండానే...వెళ్లిపోవడం మంచిదే అయింది...లేకపోతే ఎంత బాధపడేవాడో!

అన్నయ్య మనస్సు—వాడింట్లో పూసే ముద్దబంతి పూవులాంటిది!

మట్టిబొమ్మల్లోనైనా, బంగారపు బొమ్మల్లోనైనా మమత నిండినదని తెలుసుకొన్నపుడే మళ్లీ నీ దగ్గరికి వస్తాను.

మనం ఒకరికొకరం... మనం అన్నా చెల్లెళ్లం, ఆ అనుబంధాన్ని తెంపుకొంటావా, ఇందూ!

—కృష్ణ అన్నయ్య.'

మరునాడు రైలు ఎక్కే ముందు ఉత్తరం పోస్టుచేసాను.

* * *

నేను అనుకొంటూనేవున్నాను — మా ఇందిర మనస్సుకు పట్టిన గ్రహణం విడిచిపోతుందని ... అందుకే ఇందిరా, అన్నయ్యలు కలిసి హైదరాబాదు వచ్చినప్పుడు నేను పొందిన ఆనందం ఎంతని చెప్పను? ●

# వారఫలం

**9-2-68 శుక్రవారం మొదలు**
**15-2-68 గురువారం వరకు**

**మేషం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఇతరుల వ్యవహారాల్లో మొండిపట్టుదలలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యాపారాలు వారం ఆఖరులో లాభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులభంగా నెరవేరుతాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. కోర్టు వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు యింతవరకు కంటే బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. విద్యావిజ్ఞాన రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెలుసుకొంటారు.

**కర్కాటకం.** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో నూతన అవకాశాలు లభిస్తాయి. అధిక వ్యయం జరుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగ ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** వ్యాపారంలో మీరు యింతవరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో అన్నివ్యవహారాల్లోనూ చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య.** వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించ గలవు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో అధికవ్యయం జరగటం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధువులకు సహాయం చేస్తారు.

**తుల:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారలుబాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. నూతన విషయాలను తెలుసుకొంటారు.

స్త్రీలకు:— శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం** కొన్ని వ్యవహారాల్లో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు. ఉద్యోగంలో మొండివాటాలకు లొంగిపోవడం తగదు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. పైవారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు:** వృత్తిలో మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో కొన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**మకరం.** వ్యాపారంలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఇతరుల మీద ఆధారపడియే వ్యాపారము ప్రారంభించడం తగదు. వృత్తిలో ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— అనారోగ్యం చేయవచ్చును. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కుంభం** మీ ఆలోచనలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మీనం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు శ్రమమీద నెరవేరతాయి. పైవారితో మాట పట్టింపులు వచ్చే సూచనలున్నాయి. వృత్తిలో నూతన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

—మహేష్






జరిగిన కథ

కవిరాజ ధన్వంతరీ నిలయం నరసయ్యగారికి ఇద్దరు కూతుళ్ళు ఇద్దరు కొడుకులు. పెద్దపిల్ల కామేశ్వరి. పెళ్ళికి ఎదిగి వుంది తర్వాతి వాడు చిట్టిబాబు కాలేజీలో చదువుతున్నాడు. తర్వాతది సుభద్ర. చిన్నవాడు జగ్గూ సెకండ్‌ఫారం చదువుతున్నాడు. భార్య, జగదాంబ, పిల్లలూ అంతా ఆయన సంపాదన మీదే ఆధారపడి వున్నారు. కామేశ్వరి కంటె సుభద్ర అందంగా వుంటుంది. కామేశ్వరికి ఇరవై సంవత్సరాలు నిండినా ఏ ఒక్క సంబంధమూ స్థిరపడడం లేదు. వస్తూపోతూ వున్నట్టుగానే, ఆ రోజు కూడా ఒక సంబంధం వచ్చింది. దాన్ని చెడగొట్టడానికి గన్రాజు చేసిన ప్రయత్నం విఫలమవుతుంది వాళ్ళకి పిల్ల నచ్చిందని కట్నం కానుకలు ఎక్కువ యిస్తే చేసుకుంటారని ఉత్తరం వస్తుంది. నచ్చిన కామేశ్వరినే కట్నం లేకుండా చేసుకోమని అన్నకి సలహా యిస్తాడు మాధవ.

# 4

'మారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ !' అని పూర్వీకులన్నారట! మేరేజెస్ ఆర్ నాట్‌మేడ్ వితౌట్ డౌరీస్' అని ఇప్పటి వాళ్ళంటున్నారు. మనమే స్వయంభవులము అనుకునే మనుష్యులకి, తన వునికిని గుర్తు చేయటానికా అన్నట్లు విధి, అప్పుడప్పుడు విజృంభించి, తన ప్రతిభని చూపెడ్తూ ఉంటుంది. వచ్చిన ప్రతిపెళ్ళివారూ, కామేశ్వరిని చూసీచూడగానే 'నలుపు బాబూ!' అంటూ వెళ్ళిపోయేవారు. మరి కొంతమంది పెళ్ళివారు, 'నలుపుపిల్ల' అన్నవంక పెడ్తే, నాలుగు కాసులు ఎక్కువపాట పెరగకపోతుందా! అన్న ఆశతో ఆ వంక అనేవారు. అనుకోకుండా ధన్వంతరిగారి అంతేళ్ళ నిరంతరాన్వేషణ అనంతరం, ధన్వంతరిగారి కోరిక ఫలించింది. రామనాథం, వచ్చిన వేళా విశేషం, కామేశ్వరికి కానీ కట్నం ఇయ్యక్కర్లేకుండా రవ్వలాంటి సంబంధం కుదిరింది. వసుంధర అన్నయ్యే పెళ్ళికొడుకు! కేశవమూర్తి కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. నలభయి ఏళ్ళ వుంటాయి! భార్య చనిపోయి మూడేళ్ళు దాటుతోవుంది. పద్నాలుగేళ్ళ వున్న కూతురు నళిని కాలేజీలో బి. యస్‌సి. చదువుతోంది. వసుంధర, రామనాథంవాళ్ళు మూడు వేలు కట్నం అయితే చేసుకుంటామని వ్రాసిన రోజున జగదాంబతో అంది.

'మీకు రెండోపెళ్ళి వాడు, అనే సందేహం లేకపోతే, మా అన్నకు చేసుకుంటాము కామేశ్వరిని.' మొదట జగదాంబ నమ్మలేదు. కేశవకి బోలెడంత ఆస్తి వుంది. చదువుకున్నవాడు! దివాణం లాంటి మేడ! అతనితో సరిసమానంగా చదూకున్న పిల్లలే అతను వూ అంటే అతన్ని పట్టటానికి సిద్ధమయ్యేట్లుచేసే రూపవంతమైన విగ్రహం! మొదటి భార్యకి మగసంతు లేదు: వున్న ఒక్క ఆడపిల్ల పెళ్ళి కెదిగిపోయింది. పెళ్ళి చేస్తే దాని ఖర్మాన్ని అది అత్తవారింటికి వెళ్ళిపోతుంది. తన కూతుర్ని ఇంత అదృష్ట దేవత వరిస్తుందని తను వూహించనైనా వూహించలేకపోయింది. ఇంత అదృష్టం దానికి కనిపెట్టుకు వుండబట్టే తాము చూస్తూన్న చచ్చు పుచ్చు సంబంధాలన్నీ కట్నాలు కావాలంటూ తప్పిపోయేయి' అనుకుంది జగదాంబ.

'అంతకన్నానా వసుంధర తల్లీ! ఆ సంబంధం వాళ్ళకి ఎల్లా నచ్చచెప్పాలో తోచక సతమతమయి పోతున్నాం. నేనూ, మీ మామయ్యానూ! నా తల్లీ! అల్లా మీరు వప్పకుంటే, బ్రతికున్న నాలుగ్గ రోజులూ, నాకింత అన్నం వుంచిన వాళ్ళు అవుతారు. ఇప్పుడే మీ మామయ్యతో చెప్తాను. మీ ఇంటికివెళ్ళి మీ అన్ననూ; అమ్మగార్ని కామన్ని చూసుకుందుకు రమ్మని చెప్పమంటాను' అంటూ, చీర చెంగుతో ఆనంద భాష్పాలు తుడుచుకో సాగింది జగదాంబ.

'వాళ్ళు చూడక్కర్లేదండీ! నే నెంత చెబ్తే అంతే మా అన్నయ్య! మా అమ్మ నామీదే పెట్టింది, మా అన్నయ్యకి తగ్గ పెళ్ళికూతుర్ని వెతికే భారం! నాకు, మీ కామేశ్వరి నచ్చింది. నేను మావాళ్ళింటివెళ్ళి మీరు అవునంటే ముహూర్తం పెట్టించి పంపుతాను. మీరు మామయ్యగారిని కూడా సంప్రతించండి!' అంది వసుంధర.

'చూసి చూసి రెండో పెళ్ళి వాడికా, ఈయటం! అందులో మనం తొలిసారిగా చేస్తూన్న కన్యాదానం! ఒకరు కడిగిన వాళ్ళు, మళ్ళీ ఎల్లా కడగటం!' అన్నాడు నరసయ్య జగదాంబతో.

'అల్లాంటి సందేహాలు పెట్టుకుంటే, మనలాంటి వాళ్ళం ఎల్లా ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేస్తాం? నచ్చింది, నచ్చింది. అంటూనే, మూడువేలూ, నాలుగువేలూ అంటూ వెనకనించి, ఎల్లా బేరాలు ఆడుతున్నారో చూసారా? ఏదో దీని పెళ్ళి

అదృష్టంకొద్దీ ఇల్లాంటి సంబంధం కలిసి వచ్చింది. కాని, చిన్నదానికి మళ్లీ రెండుమూడువేలు లేందే, శుభ్రమయిన సంబంధం కుదరదు కదా! ఇదయినా రెండోపెళ్ళి కనుక ఇంత తేలిగ్గా చేసుకుంటామంటున్నారు అదే మొదటిపెళ్లి అయితే వాళ్ల సంబంధం గురించైనా వూహించవచ్చైనా వూహించలేనంత దూరంలో వుండాల్సిన వాళ్లం! అన్నైనా వసుంధర చేసుకుంటాం అని దృఢంగా చెబ్తోంది. కాని నాకంత నమ్మకంలేదు ఆయనా, కాలేజీలో వుద్యోగం చేస్తున్నాడు భార్య పోయి మూడుసంవత్సరాలు దాటుతోంది ఈపాటికి ఏ అమ్మాయినైనా చూడకుండా వుంటాడా! కాలేజీల్లో పాతికేసేళ్ల ఆడపిల్లలు చదూతారుకదా! మరింతకాలం తీసికి ఆగాడా! మనకి తెలీదు చేసుకుంటామన్నప్పుడు, ఇవ్వమనే చెప్పకూడా ఎందుకు?' అంది జగదాంబ

'మే' నెలలో కామేశ్వరికి, కేశవ మూర్తితో పెళ్లయిపోయింది పెళ్లి పీటలమీద తొలిసారిగా కేశవ వెంపు చూసింది కామేశ్వరి ఆదే సమయంలో కేశవ కూడా తన చెల్లెలు, తనకి నిర్ణయించిన నవవధువు వెంపు పరీక్షగా చూసాడు కామేశ్వరిని చూసేసరికి కేశవకి జాలి వేసింది 'పాపం! పేద ఇంటిపిల్ల! కనుక, తన సరదాలన్నీ కప్పెట్టుకుని తనని చేసుకుందుకు అంగీకరించింది' అనుకున్నాడు కేశవ కేశవని చూడగానే, కామేశ్వరికి జాలి వేసింది కళ్ళు దించుకుంది అతని చూపులతో తన చూపులు కలవగానే ఆమెకి సిగ్గు వేసింది

'పాపం! చదువుకున్నవాడు! గౌరవనీయుడు! ఎటూ కాని వయసులో అందమైన సహచరిని కోల్పోయాడు! కరుణామూర్తి అయిన అతనిని, తను ఏవిధంగా, ఆ నిర్మోహత్వాన్నించి విడగొట్టకలదు? అందమైన భార్య తనకి దక్కదన్న దురభిప్రాయంతో తన్ని చేపట్టటాని కంగీకరించాడు కాబోలు! వదిన—వసుంధర కూడా అందుకే తన్ని ఏరికోరి చేసి వుంటుంది!'' అనుకొంది కామేశ్వరి. ఆహూతుల సమక్షంలో కామేశ్వరి మెడలో మూడుముళ్లూ వేసాడు కేశవ!

కేశవ తల్లి సీతమ్మకి, జగదాంబ తత్వం ఏమీ నచ్చలేదు 'రెండో పెళ్లి వాళ్లకి ముచ్చట్లు ఎందుకు?' అన్నట్లు అతి కుప్తంగా ఒక పూట భోజనాలు పెట్టి ఏదో పెళ్లి అంటే పెళ్లి అని అయిందనిపించారు సీతమ్మ మనస్సు రుంజాకున్నట్లు అయ్యింది

'బొత్తిగా ఇంత ముదనష్టపువాళ్ళేమిటే వసూ! పానకం బిందెలవ్వా ఇయ్యలేదు?' అంది కూతురితో సీతమ్మ

'పోన్లెద్దూ ఏదో లేనివాళ్ళు పాపం!' అంది వసుంధర

'వసే! నీ అత్తవారి వెంపువాళ్ళని వెనకేసుకురాకు' ఆమె తరహా చూస్తే, నాకు వళ్లు మండుకపోస్తోంది ఇంత గతిలేని మూక లనుకోలేదే! ఎలాంటి



వాళ్ళు వచ్చేరు వాడికి 'పిల్లనిస్తామని! రంభలాంటి పిల్లల్ని శుభ్రమయిన కుటుంబాలవాళ్ళు ఇస్తామని ఎంత మంది వచ్చేరు? పిల్ల అయినా ఇంటికి నిండుగా అందంగా వుంటుందేమో అంటే కాకిపిల్లలా వుంది. ఆవిడ! పోనీ రెండో దాన్నయినా, ఇమ్మన్నావు కాదు! అది కాస్త కంటికి నదురుగానన్నా వుంది. ఆ జగదాంబకి అసలు మంచీ మర్యాదా తెలీదు. ఏదో నువ్వడిగి వప్పించేవు కదా, మనమేం గతిలేని వాళ్ళమనుకుంది కాబోల్ను! అంది కోపంగా.

'అల్లా విసుక్కోకు అమ్మా! పాపం ఆ పిల్ల వింటే బాధపడుతుంది. ఆ పిల్లది చాలా మంచి మనసు!' అంది వసుంధర.

'ఏం మంచో! గడసుంచి!' అని విసుక్కుంది సీతమ్మ.

'కామేశ్వరి అత్తవారింటికి వచ్చిన పది రోజులకి కామేశ్వరి పరీక్షాఫలితాలు తెలిసాయి. కామేశ్వరి మెట్రిక్ పరీక్ష ప్యాసయింది. పెళ్ళి అయిన నాటి విశేషం. విద్యావంతుల ఇంట పాదుపెట్టింది. తాను కూడా విద్యార్థినిగా మారిపోయింది. తాను కూడా కేశవతో చెప్పి కాలేజీలో జేరాలని సరదా పడింది కామేశ్వరి. ఆ సాయంకాలం 'నళిని' స్నేహితురాలితో కలిసి ఎటో షికారుకి వెళ్ళింది. సీతమ్మ వంటింట్లో ఏదో పనిచేసుకుంటూంది. కామేశ్వరికి ఏమీ తోచక తమ మేడ ముందున్న పూదోటలో ఫౌంటెన్ ముందున్న సిమెంటు బెంచీమీద కూర్చుంది. ఫౌంటెన్ చుట్టూ వున్న పూల మొక్కలు నీటితుంపర్లతో తడిసి కొత్త శోభనిస్తున్నాయి. వేసంకాలపు సాయంకాలం! ఆహ్లాదకరమైన చల్లనిగాలి పూల పరిమళంతో కామేశ్వరికి ఏదో తెలియని ఆనందం వివశం కలిగించింది. అరమోడ్పు కళ్ళతో, ఫౌంటెన్ మధ్యనున్న పాలరాతి 'క్యూపిడ్' విగ్రహం కేసి చూస్తూ కూర్చుంది. ఆ సమయంలో 'మాష్టారూ!' అంటూ లోనికి పోయే మెట్లవద్ద నిలుచుని పిలిచాడు మాధవ.

'ఇంట్లో లేరు! క్లబ్బుకి వెళ్ళారు!' అంది కామేశ్వరి. అల్లా చెపుతూనే అతని ముఖంకేసి చూసి గతుక్కుమంది. అతనెవరో ఆనవాలుకూడా పట్టింది. కామేశ్వరిని, మాధవ కూడా గుర్తుపట్టాడు. ఒక క్షణం అతనికి ఆనంద సంశయం కలిగింది. తన అన్నయ్య వధువు! ఇక్కడికెందుకు వచ్చిందా అన్న సంశయం, అన్నయ్యకీ వార్త అంటే కామేశ్వరి మాష్టారింట్లో వున్న వార్త — ఎంత తొందరగా చెప్తామా అన్న ఆనందోద్వేగంలో కొట్టుకపోయింది.

'నళిని వుందాండీ! లోపల!' అన్నాడు మాధవ.

'లేదండి స్నేహితురాలితో ఎటో వెళ్ళింది!' అంటూ మాధవకేసి చూసింది. ఇంక వెళ్ళిపోకూడదా!' అన్నట్లు ప్రార్థన నిండివుంది కామేశ్వరి చూపు. తెల్లగా పొడుగ్గా వున్న మాధవ ముఖం మీదకు పడే వుంగరాలజుత్తుని చేత్తో తమాషాగా పైకి ఎగదోసుకుంటూ కామేశ్వరి చూపుచూసి నవ్వాడు. అతని నవ్వుచూస్తే మల్లెలు విరిసిన సన్నని పరిమళం తన శరీరం అంతా అలముకొన్నట్లు అనిపించింది కామేశ్వరికి. ఎందుకో ఆమె శరీరం వివశంతో నెమ్మదిగా కంపించసాగింది.

'ఇప్పుడప్పుడే రాదాండి! నళిని!' అన్నాడు మాధవ! మాధవ వెళ్ళే ప్రయత్నం ఏమీ చేయకుండా నించోటం కామేశ్వరికి నచ్చలేదు.

'రాదు లనుకుంటా! నాతో ఏం చెప్పలేదు!' అతని వునికిని సహించలేకపోతోంది కామేశ్వరి.

'నేను జ్ఞాపకం వున్నానాండీ! ఎందుకు జ్ఞాపకం వుండను? మనం కలుసుకుని, మూడునెలలైనా దాటలేదుకదా!' అన్నాడు మాధవ.

కామేశ్వరి కళ్ళు సిద్దవిచేసి చూసింది. మాధవ వెంపు! ఇల్లా అడగటంలో ఏమిటి అతని వుద్దేశ్యం!

'వుహూఁ!' అని లోపలికి వెళ్ళబోయింది.

'అబద్ధం చెబుతున్నారు! ఎందుకని జ్ఞాపకం వుండదు? ఆ రోజు నేనూ మా అన్న మిమ్మల్ని పెళ్ళి చూపులు చూసుకుందుకు వచ్చాము. నాకోసం అనుకోకండి! మా అన్నయ్యకోసం నేనూవచ్చాను. మా అన్నయ్యకి మీరు బాగా నచ్చారుట కానీ, మా నాన్నగారు కట్నం విషయంలో కొంచెం తికమక పెట్టారనుకోండి. ఎల్లా అయినా మిమ్మల్ని...' గేటుదగ్గిర కారు ఆగింది. కారులోంచి కేశవ దిగాడు.

'హల్లో మాధవ్' అంటూ మాధవని పలకరించాడు.

'నేనూ నళినీ ప్యాసయ్యామండీ' అన్నాడు మాధవ.

'వెరీగుడ్! యూనివర్శిటీ ఎగ్జామ్స్‌లో క్లాసు తెచ్చుకుందుకు ప్రయత్నించండి. ఇద్దరూ కూడా! కమిన్!' అంటూ లోపలికి దారి తీసాడు కేశవ! మాధవ కూడా అనుసరించాడు. కామేశ్వరికి కంగా రెత్తిపోయింది. భర్త వచ్చేసరికి ఫౌంటెన్‌కి అటూ ఇటూ తనూ మాధవా, నిలబడి మాట్లాడుకుంటున్నారు. మాధవ! దుర్మార్గుడు! అక్కర్లేని ప్రశ్న లేస్తూ, తన్ని కదలనీయలేదు! అసలే తెలుగు భర్తలకి, తమ భార్యలు మగవాళ్ళతో చనువుగా మాట్లాడుతోంటే, నిప్పుల్లో నించున్నట్లు వుంటుందంటారు. అందులో తాను రెండవ భార్య! కేశవకి, తనకీ తండ్రీ కూతుళ్ళంత అంతరం వుంది! మాధవ, యువకుడు! అందమైనవాడు! కాలేజీలో చదువుకొంటూన్నా, బాధ్యతల బరువులు మోయని వయసువాడు! తాను కాపరానికొచ్చి, పదిహేనురోజులన్నా కాలేదు. కేశవ అంతర్యం ఏమిటో తనకెల్లా అవగాహన అవుతుంది? ఇల్లా తనలోతానుగా మల్లగుల్లాలుపడుతూ, కామేశ్వరి, తలవొంచుకుని, నెమ్మదిగా వరాండా మెట్లెక్కి హాలులోనికి వచ్చి లోపలికి పోబోయింది.

'చూడు! అమ్మనడిగి రెండు గ్లాసులతో కాఫీ తీసుకరా!' అన్నాడు కేశవ.

'వొద్దు! మాష్టారూ! నేను తీసుకునే వచ్చానండీ!' అన్నాడు మాధవ

'తీసుకుంటే మాత్రమేం! వొట్టి కాఫీయేకదా!' అన్నాడు. ఏవేవో కాలేజీ విషయాలు వూకదంపుగా మాట్లాడటం మొదలెట్టాడు మాధవ.

కామేశ్వరి రెండు గ్లాసుల్లో కాఫీ తీసుకవచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

'ఇతను మన నళిని క్లాస్‌మేట్! ఇద్దరూ పరీక్షలు ప్యాసయ్యారుట!' అన్నాడు కేశవ. అతని ముఖంలోకి

చూసింది కామేశ్వరి. కేశవ మామూలుగానే ఉన్నాడు. పైవాళ్ల ఎదుట మామూలుగానే వుంటాడేమో! రాత్రి తన్ని పట్టుకుని విలదీసి నాలుగు మాటలూ దులపకుండా వుంటాడా!' అనుకుంది కామేశ్వరి.

మాధవ, కేశవ, కామేశ్వరిని తన పెత్తండ్రి కూతురనో, పింతండ్రికూతురనో పరిచయం చేస్తాడని ఎదురు చూసాడు. కాని, కేశవ కామేశ్వరిని మాధవకి ఏమని పరిచయం చెయ్యాలో తోచక ఏమీ అనకుండగా వూరుకున్నాడు. కామేశ్వరికి తనూ పరీక్ష ప్యాసయినట్లు గుర్తు వొచ్చింది అప్పుడు!

'నేనూ ప్యాసయినాను' అంది.

'అల్లాగా! అన్నట్లు నువ్వు మెట్రిక్ పరీక్షకి వెళ్లినట్లు చెప్పింది వసుంధర! బాగుంది నువ్వూ ప్యాసయివావన్న మాట! వెరీగుడ్!' అన్నాడు కేశవ.

కామేశ్వరి కాఫీ గ్లాసులు తీసుకుని లోపలికి వెళ్లిపోయింది. వంటింట్లో అత్తగారు ఏదో పొయ్యిమీద వండుతూనే వుంది. వంటిల్లు చీకటిగా వుంది. స్విచ్ వేసింది సీతమ్మ. కాని బల్బు వెలగలేదు.

'ఎలక్ట్రీ లేదేమిటమ్మా!' అంది సీతమ్మ.

'లేదత్తయ్యా! దీపాలు ఇల్లంతా వెలుగుతున్నాయి! వంటింట్లో బల్బు మాడిపోయింది కాబోలు!' అంది కామేశ్వరి.

'లాంతరు వెలిగించి తీసుకొనిరానాండి!' అంది కామేశ్వరి.

# మూడుముళ్ళూ

(౩)

'లాంతరు వెలుగు చాలదే అమ్మాయ్!' అంది సీతమ్మ.

'అట్లాయితే వుండండి.' అంటూ, కామేశ్వరి స్టోరు గదిలోని బల్బు తెచ్చి వంటింటిలో పెట్టింది. లైటు వెలిగించి, అక్కడున్న పీటమీద కూర్చుంది కామేశ్వరి. కోడలు తన వెనకతలే కూర్చోనుంటం సీతమ్మకి ఎంతో సంతోషం కలిగించింది.

'అబ్బాయి వచ్చినట్లున్నాడు' అంటూ కోడల్ని కదలేసింది.

'వచ్చారు. కాఫీ ఇచ్చాను హాలులో ఎవరితోటో మాట్లాడుతున్నారు' అంది కామేశ్వరి.

'కాస్త కూరముక్కలు తరిగిద్దూ!' అంది సీతమ్మ.

బెండకాయలు, బంగాళా దుంపలు తెచ్చుకుని కత్తిపీట ముందేసుకుని తరుగుతూ కూర్చుంది.

'షాన్లే తల్లీ నీకు అన్నీ వచ్చును! ఇట్టే ఎలక్ట్రీ దీపాన్ని వెలిగించావు! చచ్చిపోయినవాళ్లని అనకూడదు కాని, పెద్దావిడ వుండేది! అబ్బ! ఆ రాజేశ్వరీ దేవి రాజసానికి అంతే వుండేదికాదు! ఎప్పుడూ ఇల్లు పట్టేదికాదు కదా! క్లబ్బులూ, మీటింగులూ, స్నేహితులు, రావటాలూ, పోవటాలూ, ఇల్లంతా ఒకటే సత్రవలా వుండేది. మూడ్ని తత్వం తెలుస్తోంది కదా నీకు! దేనికీ వద్దండకా, కదనదకా! ఇంట్లో ఒక్క రోజున్నా, ఒక్కగాని ఒక్క కోడలనీ, నా దగ్గర కూర్చుని కూరా, నారా, తరిగిచ్చిందీ! నా పనుల్లో సాయపడిందీ! ఇదిగో, నీ కూతురి వరస చూస్తున్నావు కదా! ఈడొచ్చిన పిల్లది! ఎక్కడున్నా అణుకువా, ఆడతనం వుందా! తల ఎగరేసుకుంటూ రోడ్లట్టుకుని తిరగడవే దానిపని!' అంటూ కాస్సేపు చనిపోయిన పెద్ద కోడల్నిగురించి బ్రతికున్న మనుమరాలిగురించి చెప్పి తిరిగి కామేశ్వరి పుట్టింటి వారిమీదకు ధ్వజ మెత్తింది సీతమ్మ.

'మాడమ్మాయ్! పెద్దదాన్ని! నేను ఏదోగా, అంటున్నాను అనుకోకు! మీ అమ్మ నీకు రెండోపెళ్లి రెండోపెళ్లి అంటూ బొత్తిగా, నాసిగా చేసేసింది పెళ్లి. నిజానికి రెండోపెళ్లి అనే కాస్త వారా ఉండబట్టేగా నువ్వు కానీ కట్నం లేకుండా కోటలాంటి ఇంట్లోకి వచ్చి పడ్డావు! కేశవాయ మొదటి పెళ్లి ఎంత ఘనంగా జరిగిందనుకున్నావ్! ఇరవయి ఏళ్లక్రితం వాళ్లు అయిదువేలూ కట్నం ఇచ్చారు. ఇప్పటి రోజుల్లో అయితే, ఇరవయివేల రూపాయిల విలవన్నమాట! నాకూ, మీ వదినకీ చెరొక అయిదు వందలరూపాయిలూ, లాంఛనాలూ, పట్టుచీరలూ ఇచ్చారు. వదేసి పెద్ద రాశి కాసులు ఇచ్చారు. అయిదురోజులూ ఘనంగా పెళ్లిచేసారు. ఈ ఇంట్లో వున్న పందిరి మంచాలూ, మంచుబీరువా (ఫ్రిజిడేర్) ఇస్త్రీ పెట్టె (వాషింగ్‌మిషన్) అన్నీ తను సారెగా తెచ్చుకున్నవే! అన్నీ మన కెందుకు! రేపు దాని కూతురు పెళ్లి అయితే. అదే పట్టుకపోతుంది దాని తల్లి సామాను అంతా! కాళ్లు గడిగేరు వందతులాల వెండికంచంలో! పానకం బిందెలు వెండివి ఇచ్చేరు. ఇంక గ్లాసులు సరేసరి! పిల్ల రాజేశ్వరి కూడా బంగారు శల కలా వుండేది! గొప్పింటిపిల్ల! అందుకనే అంత హాయిగా ఇల్లంతా వెలిగిపోయేది అది వున్న నాలుగురోజులూ! ఇప్పుడూ అంత బాగ చేయగలిగినవాళ్లూ వాడితో సమానంగా చదువుకుని వుద్యోగాలు చేస్తున్నవాళ్లూ పిల్లని నిస్తా






మంటూ వొచ్చారు. కాని కేశవాయే ఒప్పుకోలా!

వసుంధర, బ్రతిమాలగా బ్రతిమాలగా ఎన్నో రోజులు నీ గురించి చెప్పగా చెప్పగా, సరే అన్నాడు! అందుకని అంత లోకువగా చేస్తారా పెళ్ళి, చెప్పు! కట్నకానుకలు అఖర్లేదన్నందుకు ఇంకెంత బాగాచేస్తారో అనుకున్నా. ఛీ్ఛీ ఛీ్ఛీ అనిపించేసేరు! ఆమాత్రం బుద్ధి మీవాళ్ళకి లేకపోయింది! ఒక్క జరీ పంచెల చాపన్నాపెట్టేరా అల్లుడికి! వాడేం పెళ్ళికి ముఖం వాచి పోయేడనుకున్నారా మీవాళ్ళు! మంచి గంధబ్బొమ్మలాంటి దానితో, లేదంటె, ఇరవయి ఏళ్ళ సంసారంచేసాడు! 'పుత్తడి బొమ్మ'లాంటి కూతురుంది! రేపీ పాటికి కూతురుకి పెళ్ళి చేసుకున్నాడంటే, మనవలు పుట్టుకొస్తారు! ఏదో నేను పెద్దదాన్ని అయిపోయేను! కూతురుకు, పెళ్ళి చేస్తే. అత్తారింటికిపోతుంది! నేను కాస్త గుటుక్కుమంటే వాడికి కాస్త చెయ్యి ఆసరాగా ఇంట్లో ఆడది మసలాలనిచేసాం! కాని వాడికి పెళ్ళిముచ్చటా, పెళ్ళాంముచ్చటా తీరలేదని చేసామా చెప్పు! రేపు మీ చెల్లాయికి ఇల్లాగానీ ఖర్చు చేయకుండా, పెళ్ళి చేస్తే అదూరుకుంటుందా! అసలు ఎవళ్ళచేసుకుంటారు దాన్ని మటుకు! చేసుకుంటేమటుకు, కొత్త చీరన్నా కొనకుండా, పట్టు బనారస్ చీరపెట్టకపోతే మానే, నాలుగురూపాయల కట్టుడు చీరన్నాకొని పసుపురాసి బొట్టుపెట్టి ఆడపిల్లని పంపకపోతే వూరుకుంటారా అసలలివాళ్ళు! మిఠాయిలతో ఇల్లు నింపక్కర్లేదు! అర్ధవీశ బెల్లం చలిమిడన్నా వొళ్ళోపెట్టి పంపరా కూతురుని? రెండో పెళ్ళి పెళ్ళాం అయితే ఇంక కడుపు చల్లన వుండక్కర్లే దనుకుందా మీ అమ్మ? తాను మళ్ళీ ఎల్లాకన్నదీ, నలుగురు పిల్లల్ని! ఆబుద్ధివుండక్కర్లేదా కన్నతల్లికీ!' అంది సీతమ్మ.

కామేశ్వరి ఏమీ అనలేదు. 'నిజమే! వూరికే చేసుకుంటామనగానే, కనీస లాంఛనాలుకూడా జరపకుండాచేసారు. తన పెళ్ళికి మూడువేలు దాచామని చెప్పే వాళ్ళు! ఏం ఖర్చుపెట్టారు, తన పెళ్ళికి! మూడుపందల రూపాయిలన్నా

# వస్తువులను పెట్టుటకు ఖీరా క్యాబినెట్లు !

ఖీరా క్యాబినెట్లు త్రుప్పుపట్టని, ముక్కలుగా ఊడని ఉక్కు నుండి ఎంతో అందమైన ఫినిష్‌తో తయారు చేయబడ్డాయి. ఇవి ఎన్నో ఏళ్ల పాడవకుండా మన్నుతాయి. మీ విలువైన వస్తువులను భద్రముగా పెట్టుకొనుటకు ఖీరా స్టీల్ క్యాబినెట్లు ఎంతో అనువుగా ఉంటాయి. ప్రతి క్యాబినెట్‌కు గట్టిగా తాళము పడే ఏర్పాటు ఉంది. మీకు కావాలంటే వీటి షెల్ఫులను మార్చి పెట్టవచ్చును మరియు అదనపు హేంగులను పెట్టుకోవచ్చును. ఆఫీసులో లేక ఇంట్లో, ఎక్కడైనాసరే, మీ వస్తువులను భద్రముగా పెట్టుకొనుటకు ఖీరా క్యాబినెట్లనే కొనండి!



'యుటిలిటీ': 1971 మి.మీ. x 910 మి.మీ.x 481 మి.మీ. (78″x36″x19″)



'పాప్యులర్': 1641 మి.మీ. x 831 మి.మీx 481 మి.మీ. (65″ x33″x19″)



'మిడ్జెట్': 1270 మి.మీ. x 760మి.మీ. x481 మి.మీ. (50″ x 30″x19″)

JWT-KSW-4883




ఖీరా స్టీల్ వర్క్స్ ప్రైవేట్ లిమిటెడ్
స్వామి వివేకానంద రోడ్, సాంతాక్రుజ్, బొంబాయి-54

ఖర్చుపెట్టలేదు! తనకి ఒక జత బంగారపు గాజులన్నా చేయించలేదు. తాతయ్యగారి సంబంధానికి, అయిదువాసులు బంగారంపెట్టాం. అంది తన తల్లి! పోనీ ఆ బంగారమేనా, తనని వూరికే చేసుకుందుకు వచ్చినందుకన్నా పెట్టవచ్చు కదా! కనీసం ఒక పట్టుచీరన్నా కొనలేదు. తను కొనమంటే,

'నీ అదృష్టం బాగుంది! ఇంక పెట్టేడు చీరలూ, పెట్టేడు నగలూ పెట్టుకుంటావు! ఇంకెందుకు అనవసరంగావున్న డబ్బు ఖర్చుపెట్టుకోవటం! చెల్లి సంగతి చూడాలి! పెళ్ళికావాల్సిన పిల్ల అది! దానికి మంచిబట్టలు లేకపోతే నలుగురిలో బాగుండదు!' అంది తల్లి. అప్పుడే తనకీ తనవాళ్ళకీ ఋణానుబంధం తీరిపోయింది. మూడుముళ్ళూ వేయగానే, తన కష్టసుఖాలన్నిటితో, వీళ్ళకే ముడిపడింది కాబోలు! ఇంక తన బాధ్యతంతా వీళ్ళదే! కామేశ్వరికి కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి. సీతమ్మ కోడలి వెంపు చూసింది. కామేశ్వరిముఖం దీనాతిదీనంగావుండటం చూసి, సీతమ్మ, స్త్రీహృదయం ద్రవించిపోయింది.

'తప్పు! ఏడుస్తున్నావా! ఆసురసంజవేళ కంట తడిపెట్టకూడదు తల్లీ! ఇంటి ఇల్లాలివి! నిన్ను సాధిద్దామని అనలేదు. వూరికే మా వైనం చెప్పాను. ఆశ దోషం ఎరుగదూ అని! నిజానికి మాతో నువ్వు చక్కగా కలిసిపోయావు! పెద్దానికన్నా నువ్వే మాతో చనువుగా వున్నావు! ఆ తల్లి మేడగదేవాదు! మహారాణిలా ఇరవైనాలుగ్గంటలూ పడుకుంటూ కూర్చునేది! కన్నవాళ్ళ కార్యానికి నువ్వేంచేస్తావ్!' అంది సీతమ్మ.

రాత్రి పదిన్నర అయినాక అప్పుడు వచ్చింది నళిని. అప్పటికే, కేశవ భోజనం చేసి, మేడమీదకువెళ్ళి పడుకున్నాడు. కామేశ్వరీ సీతమ్మకూడా భోజనాలుచేసారు. కామేశ్వరి, వంటిల్లు కడిగి ముగ్గుపెట్టింది. ఒక కంచంలో, అన్నం, కూరలూ, నెయ్యీవేసి, పెరుగు చిన్న గిన్నెతోపెట్టి ఇంకో కంచం మూతవేసింది. సీతమ్మ హాలులోవున్న కవాచీ బల్లమీద పరుపు తలగడావేసుకుని పడుకుంది. కామేశ్వరికూడా వంటింటి తలుపు జేరవేసివచ్చి సీతమ్మ కాళ్ళవద్ద కూర్చుంది.

# మూడుముళ్లూ

'నువ్వుకూడా వెళ్ళి పడుకో తల్లీ!' అంది సీతమ్మ.

'నళిని ఇంకా రాలేదు' అంది కామేశ్వరి.

'అది అంతే అమ్మా! ఊళ్ళన్నీ దేవిరించి, దేవిరించి, ఏ అర్ధరాత్రికో ఇల్లు జేరుతుంది. తండ్రి ఏమీ అనడు! నేను ఏమి చెప్పినా అది లెఖ్ఖచేయదు. భోజనం కంచంలోపెట్టి బల్లమీద పెట్టెయ్యి! నువ్వెళ్ళి నిద్రపో!' అంది సీతమ్మ. కామేశ్వరి, పైకి వెళ్ళిపోయింది. ఇంకా గదిలోకి వెళ్ళలేదు. నళినివచ్చింది. వస్తూనే 'అప్పుడే అంతా మంచాలెక్కేసారేమిటి!' అంది.

'అప్పుడే అంటున్నావా! మొదటాట సినిమా వదలి ఎంతసేపు అయ్యింది!' అంది సీతమ్మ.

'పోనీ! నీకంటె పెద్ద కాలం! నిద్రకి ఆగలేవు అనుకోవచ్చును. అదికేం పోయే కాలం! ఈవిడ వచ్చినా, నాకంచం వేసు పెట్టుకుని, అన్నం తినాలా! కాస్త విస్తట్లో అన్నంపెట్టి కంచం తీస్తేనే అరిగిపోతుందా, నీముద్దులకోడలు!' అంది నళిని.

'నేను మెలుకువగానే వున్నానుకదా! పద అన్నంపెడతాను. కాళ్ళుకడుక్కో!' అంది సీతమ్మ.

'హు! ఇన్నాళ్ళూ, నువ్వేమన్నా పెట్టేదానివా! నేను లేచి లేను తల్లీ అంటూ దీర్ఘం తీసేదానివి! నీ ముద్దులకోడలు వచ్చేక, అదిపని నేనేమనిపోతానో అని, నువ్వే అర్ధరాత్రిదాకా మేలుకొనివుంటున్నావ్!' అంది ఎద్దేవాగా నళిని.

'అర్ధరాత్రి అయ్యిందని ఒప్పుకుంటున్నావుకదా!' అంది సీతమ్మ.

'ఎందుకు ఒప్పుకోను బామ్మా! అయినా ఈ కామేశ్వరికి, లేనిపోని దర్జాలు మప్పుతున్నారు నువ్వూ అత్తయ్యా కలిసి! లేకపోతే, ఆమె కెంత ధీమా! నేను ఇంటికివచ్చి భోంచెయ్యకుండనే, తాను కడుపునిండా మెక్కి పడుక్కొంటుందా!' అంది నళిని.

'నేను పెడతానన్నానుకదే తల్లీ!' అంది సీతమ్మ.

'నువ్వేం పెట్టక్కర్లేదు. నాకీ ఇంట్లో అన్నంవుండదని నాకు ముందే తెలుసు! స్నేహితురాలింట్లో భోజనంచేసేవచ్చాను. అసలు ఆమెగారి అవిధేయత చూడు! లేనింటి పిల్లఅయితే అణిగి మణిగిపడి వుంటుంది, అంది అత్తయ్య. ఇదేకాబోలు అణిగి పడి వుండటం అంటేను! నేను పెద్దదాన్ని అయ్యాను కనుక సరిపోయింది! అదే, చిన్నపిల్లని, అయితే, తప్పకుండా విషం పెట్టి చంపును! ఎలా అన్నా సవితి తల్లి అన్నాక సవితి తల్లే!' అంది నళిని.

'వూరుకో తల్లీ! అర్ధరాత్రి గొడవలు పెట్టకు!' అంది సీతమ్మ!

కామేశ్వరి, అంతా వింది. గాఢంగా నిట్టూర్చింది. నళినికితనంటే, ముఖ్యంగా తాని ఇంటికి రావటానికి ఇష్టంలేదని గ్రహించింది! ఆమె తనకన్నా నాలుగయిదేళ్ళు చిన్నదయినా, బొత్తిగా తనకి కూతురయ్యే ఈడు తనకిలేదు! తనని స్నేహితురాలిగా చూడకూడదా! తనేమన్నా, ఆపిల్లని, అరడిపెట్టేంత అధికారిణి అయ్యిందా! చిన్నపిల్ల అయితే విషం పెట్టి చంపేసును అంది! సవతి తల్లులందరూ, పిల్లలకి విషాలుపెట్టి చంపేస్తారని, తనకింతవరకూ తెలిసే తెలీదు. తన్ని ప్రేమగా, ఆదరణగాచూసే వసుంధర, అత్తవారింట్లోవుంటుంది. ఇంక అత్తగారికి, తన పుట్టింటివాళ్ళు ఏమీ ఘనంగా పెళ్ళిచేయలేదని, అప్పుడప్పుడు, సముద్రపుపొంగులా, ఏదో ఒక ఆలోచన వస్తూనేవుంటుంది. నళిని తన ఈడూ జోడూ అయిన పిల్లది. తనతో సరదాగా వుంటుందేమో అంటే ఆపిల్లకి, తన తల్లి స్థానం ఇదెవరో గతిమాలినదివచ్చి, ఆక్రమించుకుందనే కోపంపెట్టుకుంది. ఇంక, మూడుముళ్ళూవేసి తన బాధ్యతని, శాశ్వతంగా తన నెత్తిమీదవేసుకున్న మహానుభావుడు, ఇరవయిఏళ్ళ సంసారజీవితాన్ని తల్చుకుంటూ, ఆయన వుంటాడు! ఇంక తన వునికిని గుర్తించేది ఎవరు? తను ఎవరికికావాలి? తను ఎవరికీ అక్కర్లేదు. తనకి అందరూకావాలి! పెళ్ళికాకుండా తన తల్లితండ్రులకే తను మహాభారంగావుండేది. ఇంక ఇప్పుడు, వాళ్ళకి చేతులు కడుక్కున్నంత హాయిగా తేలిగ్గావుంది!

(ఇంకా ఉంది)




# చేతి ఖర్చులు

కె. రామలక్ష్మి

పంచదార నల్లబజారులో కూడా దొరకని సమయంలో మా పక్కింటావిడ ఓరోజు అడిగింది 'ఓ కిలో పంచదార కావాలా?' అని రెండున్నర యిచ్చి పుచ్చుకున్నాను.. వాళ్ళు పక్క వాటాలో కొత్తగా దిగారు. కొంచెం పెద్ద సంసారమే. భర్త కూడా సౌమ్యుడే గాని మరీ అంతపెద్ద జీతగాడు కాదు. అలాంటివారికి రేషనులో యిచ్చే పంచదారే సరిపోదు. ఇాక యిలా ఎక్కువగా ఎలా యిచ్చింది చెప్మా అనుకున్నాను. అడిగితే బాగుండదుకదా! ఓ వారం పది రోజులు గడిచాక 'మావాడు మంచి బియ్యం యిచ్చాడు ఈ వారం, రెండు లీటర్లు కావాలా?' అంటూ అడిగింది. వద్దు అన్నానే గాని, గోడదాటి వెనకింటావిడని ఆవిడ అడగడం వింటూనే వున్నాను.

సాధారణంగా కొందరాడవాళ్ళకి ఇంట్లో సామాను చాటుమాటుగా అమ్మే అలవాటు వుంటుందని విన్నానేగాని చూడలేదు. తన సామాను తనెందుకు అమ్ముకోవడం? ఆ డబ్బుతోనైనా తిరిగి కొనాలి గదా అని ఆలోచిస్తే అసలే అర్థంకాలేదు.

మాటల సందర్భంలో ఓ మధ్యాహ్నం ఆవిడని అడిగాను. పంచదారగాని, బియ్యం గాని ఎలా ఎక్కువగా మిగులుతున్నాయని. ఆవిడ అమాయికంగా నవ్వింది. 'ఎక్కువ అవవు మామీ, తక్కువ అయితే బజారులో కొని తెస్తారాయన' అంది. 'మరి తక్కువ అయే మాటుంటే యిలా అమ్మడం ఎందుకు?' అని సూటీగానే అడిగాను. మొదట కొంచెం తటపటాయించిందామె. కాని నెమ్మదిగా కష్టసుఖాలు వెళ్ళకక్కడం మొదలు పెట్టింది. 'ఏం చెయ్యమంటారు? ఒక్క నయాపైసా చేతికివ్వరు. అడిగితే అన్నీ తెచ్చిపడేస్తుంటే డబ్బులెందుకు అంటారు. ఈ పిల్లలా మధ్యాహ్నం పూట అది కావాలనీ ఇది కావాలనీ ప్రాణాలు తీస్తారు. ఇలా ఓ కిలో పంచదారో, బియ్యమో డబ్బుచేసి చిల్లర కర్చులు చేస్తాను' అందా ఇల్లాలు. నాకు చాలా జాలివేసింది. బాధ కల్గింది. నిజమే పిల్లల తల్లి అటువంటి అసహాయపరిస్థితిలో ఇంతకుమించి ఏంచేస్తుంది! అనిపించింది.

అన్నీ తెచ్చిపడేసినా ఇంట్లో ఆడవానికి అడపాతడపా బేడో, పావలావో అవసరం అవుతూ ఉంటుంది. పక్కింటి మామీ 'ఓ పదిపైసలిస్తారా సాయంత్రం యిచ్చేస్తాను' అని అడిగితే లేదనే స్థితిలో ఏ గృహిణైనా ఉంటే ఆమె మానసికంగా చాలా కించపడుతుంది. రూపాయిలూ పదులూ అప్పు లివ్వలేకపోవచ్చు. పావలా బేడా కూడా లేదనడానికి బాధపడుతుంది. అదే చేతిలో నాలుగు డబ్బులుంటే ఇలాంటి చిన్నచిన్న యిచ్చిపుచ్చుకోడాలూ, ఇరుగు పొరుగుల

## డాక్టర్ కబుర్లు

### పెరుగులో క్రిములు

పెరుగులో క్రిములుంటాయి. అవి ఒంటికి మంచివి! పేగుల్లో చెడ్డక్రిములని నాశనం చేస్తాయి కూడా.




స్టెఫిలోకోకస్ చెడురకం క్రిములలో ఒకటి. ఎందరికో జీర్ణవ్యాధులు వీటి మూలంగానే వస్తాయి. పెరుగులో క్రిములు వాటి మీద యుద్ధం చేసి వాటిని చంపేస్తాయి!

ఒక విషయం— అసలు మనిషి పేగులలో ఈరకం మంచిక్రిములలు ఎప్పుడూ ఉంటాయి కాని పెరుగు, మజ్జిగల వల్ల వాటి బలం పెరుగుతుంది!

ఈ మధ్య అమెరికాలో ఈ రకం క్రిములు ఉండే కాప్స్యూల్‌లు అమ్ముతున్నారు— ఒక్కొక్క దానిలో 30 లక్షల క్రిములు ఉంటాయి. రోజుకి నాలుగు తిని, ఒక్కొక్కసారి పాలు పుచ్చుకోవాలి...

హెచ. ఎల్. హెర్సెన్‌సోన్
(కాపీరయిటు)

మొహమాటాలూ మిగులుతాయి గృహిణికి. ఇవి ఆమెకి ఎంతైనా అవసరం.

కూరలకి అని రూపాయియిస్తే ఏ పావలా దాన్లో మిగిలినా అది పోపుల పెట్లో పడేస్తుంది గృహిణి. కొందరు మగవాళ్లు ఇనికూడా పెద్ద లపరాధాలుగా ఎన్నిక చేస్తారు. దారుణం.

నిజానికి చేతికర్చుకి అని — ఎంత అల్పమో తెచ్చిపడేసినా — భార్యకోరూపాయో రెండో భర్త యిస్తే ఆ భార్య వాటిని తక్షణం కర్చు పెట్టకపోయినా కొంచెం ధైర్యంగా ఉంటుంది. అంతేకాదు. ఇలా కర్చుకని డబ్బు చేతిలో ఉండడంతో ఇంట్లో సామానులు కనీకనిపించకుండా అమ్మి డబ్బు చేసుకోవాలన్న 'చిన్న బుద్ధులు' దూరం అవుతాయి.

న్యాయానికి ఒక వయస్సుకి వచ్చిన పిల్లలకే 'పాకెట్‌మనీ' అంటూ కొంత డబ్బు యివ్వడం అవసరం. డబ్బు విలువ తెలియాలన్నా, డబ్బులు జాగ్రత్తగా సర్దుకుంటూ కర్చు చేయడం తెలియాలన్నా, చిన్న దొంగబుద్ధులు రాకుండా ఉండాలన్నా పిల్లలని స్వల్పంగా స్వంతంగా డబ్బు కర్చు చేయనియాలి. ఇలా ఇచ్చిన డబ్బు ఎలా కర్చు చేశావని అడగవచ్చు కాని 'ఇలా చేయి' అని చెప్పకుండా ఉంచేయాలి. ఇంట్లో స్త్రీలకి చేతిలో డబ్బు ఎందుకు? అని కొందరు మూర్ఖంగా వాదిస్తారు. కాని ఎందుకేమిటి? బజారులోకి మంచి చీపుళ్లు వస్తే కొండానికి! మిల్లుకి పప్పుపంపించి ఆడించడానికి! బేడ పువ్వులు కొనుక్కోడానికి. డబ్బు ఎందు కన్న ప్రశ్నకి అర్థంలేదు. చేతి కర్చుకి డబ్బు ఉన్న ఆడవాళ్లు ఇరుగు పొరుగులతో మంచిగా ఉంటారు. 'మావారు కాసి ఇవ్వరు' అంటూ ఇంట్లో సామాను అమ్ముకోరు.

పిల్లలు పుట్టకుండా ఉండేందుకు మాత్రలని కనిపెట్టారు, పెడుతున్నారు. త్వరలో మాత్రల బదులు ఇన్‌జక్షన్లని వాడవచ్చు.

ఈ ఇన్‌జక్షన్ నెలకి ఒకసారి ఇస్తే చాలు. దీనిని నేడు 7000 మంది ఆడవారిమీద వాడి చూస్తున్నారు. ఈ వాడకాలని 60 మంది పరిశోధకులు అనుశీలిస్తున్నారు.

వాష్విల్ అనే ఊరిలోని మహర్రీ మెడికల్ కాలేజీకి చెందిన డా. బొర్నెల్ ఇలా అంటున్నారు — 'ఇది సురక్షితమయినదీ, నమ్మదగ్గదీ, పుచ్చుకున్న వారిలో ఇతర గుణాలు లేపనియ్యనిదీను.'

ఈ సూది మందు పేరేమిటి? దానిని ఎవరు కనిపెట్టారు? 'డెలాడ్రాక్సేట్' అనే ఈ మందుని ఇ. ఆర్. స్క్విబ్ కంపెనీవారు కనిపెట్టారు. (పూర్తి పేరు—మందుది—కావాలంటే, అందులో డయిహయిడ్రాక్సీ పయిరో జెస్టెరోన్ ఎసెటో ఫినయిడ్, ఎస్ట్రాడియాల్ ఎనాన్‌టేట్‌లు ఉన్నాయి!)

స్త్రీ రుతుక్రమం మొదలయిన ఎనిమిదవరోజు ఈ ఇన్‌జక్షన్‌ని పిర్రమీద ఇవ్వాలి. 66 మందికి ఈ మందు ఇవ్వగా, ఆరునెలలలో ఏ ఒక్కరికీ కడుపు రాలేదు. ఇతర గుణాలు ఏవీ కనిపించలేదు, ఏ రకమయిన రక్తస్రావమూ జరుగలేదు అని డా. జేమ్స్ అనే వయిద్యుడు వెల్లడిచ్చారు. అంతేకాక దీనివల్ల రుతుక్రమం మారటం కూడా జరుగలేదన్నారు ఆయన.

ఒకవేళ కొందరిలో ఏమయినా ఇతర గుణాలు కనిపిస్తే అవి సగటు లెక్కలమీద మామూలుగా స్త్రీలలో కనిపించే గుణాలే అని డా. జేమ్స్ అభిప్రాయం. ఉదాహరణకి ఈ సూది మందు పుచ్చుకున్నవారిలో ఈయన గమనించిన గుణాలు కొన్ని: రుతుక్రమంతో బాధ, ఉదరంలో నెప్పిలేక ఉబ్బరం. ఒక రకం స్రావం, వక్షస్థలంలో పచ్చితనం, కోర్కె తగ్గిపోవటం.

కొందరు వనితలకి ఎస్ట్రోజన్ మందులు పడవు. వారికి ఈ ఇన్‌జక్షన్ ఇవ్వటం మంచిదికాదు.

'అంతేకాక, గర్భం ధరించినప్పుడు త్రోంబో ఎంబోలిక్ సంఘటనలు కలవారికి, ఆస్త్మా, మయిగ్రెయిన్ తలనెప్పి ఉన్నవారికీ, ఎపిలెప్సీ ఉన్నవారికీ ఇచ్చేముందు జాగ్రత్తగా ఆలోచించటం మంచిది,' అంటారు డా. జేమ్స్. ఇదే రకం అభిప్రాయాలని ఇతర పరిశోధకులు కూడా ప్రకటిస్తున్నారు. (త్రోంబస్, అంటే రక్తనాళంలో నలుసు; ఎంబోలిసమ్, అంటే నాళాలలో నలుసులు ఉండే పరిస్థితి. ఎపిలెప్సీ అంటే మూర్ఛ వ్యాధి అని వేరే చెప్పనక్కరలేదు.)

—ఆన్ హోనిగ్ (ఇన్‌ఫా.)

వంటలు:

## ఎగ్ కర్రీ

అరడజను కోడిగుడ్లు.
2 ఉల్లిపాయలు.
వెల్లుల్లి రేకలు రెండు.
టమేటోలు నాలుగు.
1 చెంచా ధనియాలు.

గుడ్లు గట్టిగా ఉడికించి చల్లారాక ఒలిచి మధ్యకు కోసి ఉంచాలి. ఉల్లిపాయి, వెల్లుల్లి, ధనియాలు, పసుపు చిటికెడు, కొంచెం గసగసాలు ముద్దగా నూరి ఉంచుకోవాలి. టమేటో ముక్కలు కోయాలి. వెడల్పాటి గిన్నెలో కొంచెం నెయ్యిగాని నూనెగాని వేసి బాగా కాగాక నూరిన ముద్ద వేసి కలియ పెట్టాలి. తరువాత టమేటో ముక్కలు, కరివేపాకు వేసి ఓ అయిదు నిమిషాలు మగ్గాక, కోసి ఉంచిన గుడ్లువేసి జాగ్రత్తగా కలియ పెట్టాలి. సన్న సెగమీద ఐదు నిమిషాలు మగ్గ నిచ్చి దింపుకోవాలి. ఈ కూర ఉట్టిన తినడానికీ, అన్నంలోకీ కూడా బాగుంటుంది.




ఆకలితో రెచ్చిపోయిన పిచ్చి రాక్షసిలాగ, పొడుగ్గా పరుచుకొని ఉన్న రైలుమార్గాన్ని, ఆబగా మింగేస్తూ, నేను ప్రయాణం చేస్తూన్న మద్రాసు–హౌరా ఎక్స్‌ప్రెస్ విజయవాడ వేపు మహా వేగంతో దూసుకుపోతోంది. ఎప్పుడో పొద్దుటనగా గూడూరులో చేసిన భోజనం ఏమో, ఏలూరులో దిగిపోయే నాలాంటి ఏ కొద్దిమందివో తప్ప, ఎక్కువ దూరపు ప్రయాణీకులంతా 'మీల్స్‌స్టాప్' అయిన విజయవాడ స్టేషను ఎప్పుడొస్తుందా, ఎప్పుడు భోజనం చేద్దామా అని తెగ ఆరాట పడుతున్నారు. ఇలా ప్రయాణీకులూ, ప్రయాణీకులతోబాటు ఎక్స్‌ప్రెస్సూ కృష్ణానదీవంతెన మీద సాయం సంధ్యా సమయంలో చేస్తూన్న ఆ ఆకలి తాండవం చూసి కాబోలు లక్షలాది ప్రజలకు అన్నం పెట్టే అన్నపూర్ణ లాంటి ప్రకాశం బేరేజీ, అప్పుడే వెలిగించిన మెర్క్యురీ చిరునవ్వులు నవ్వుతోంది దూరాన్నుంచి. –

స్లీపర్ కోచ్‌లోని ఆ అరలో, షడ్రుచులులా కూర్చున్న మా ఆరుగురిలోనూ ఆరు రకాలైన చైతన్యం బయలుదేరింది, రాబోయేది విజయవాడస్టేషన్ అని తెలియగానే.

అందులో, కిటికీ పక్కనే ఉన్న సీటులో కూర్చున్న నా సంగతి చెప్పనే అక్కర్లేదు! —విజయవాడ స్టేషను అంటే నాకు భలే సరదా... ఏమంటే, అప్పుడే బాంబులు పడ్డ ప్రదేశంలాగ, నల్లని పొగలతో, చెవులు చిల్లులుపడే చప్పుళ్లతో, వందలాది ప్రజల తొక్కిసలాటతో, రణగొణ ధ్వనిగా, చెప్పలేనంత కోలాహలంగా, బలే తమాషాగా ఉంటుంది. ఆటంబాంబు పడుతూన్న హీరోషిమాను కానీ, పధ్నాలుగేళ్ల క్రితం ఇంచక్కా ఇన్నీసుపేట వీధులన్నీ వెన్నీసు వీధులలా మారి పడవలతోనూ, ప్రజల పెడబొబ్బలతోనూ నిండి ముచ్చటగా వరదలలో మునిగిన రాజమండ్రినికాని చూడలేదే అని, ఎప్పుడూ ఆవురు ఆవురు మంటూ నాలో పెద్దపులిలా నోరు తెరుచుకొని ఉండే ఓ చిత్రమైన కోరికకి విందు భోజనంలా ఉంటుంది ఆ విజయవాడ స్టేషను సందడి. అందుకే జాగ్రత్తగా సర్దుకుని సిద్ధంగా కూర్చున్నాను కన్నుల విందుగా అనుభవించబోయే ఆ ఆనందాన్ని కమ్మగా ఊహించుకుంటూ.

నా పక్కని కూచున్న సిల్కు లాల్చీ శ్రీమంతుడిమీద కూడా, రాబోయే విజయవాడ స్టేషన్ ప్రభావం పడినట్టుంది. తనకి అటుప్రక్క కూర్చున్న గజ్జెల వడ్డాణపు సతీమణితో అప్పటిదాకా చెబుతూ వచ్చిన శ్రేయోరాజ్య స్థాపనామార్గాల్ని చటుక్కున ఆపుచేసి 'ఇంతకీ మీ తమ్ముడు స్టేషన్‌కి భోజనం తెస్తాడంటావా?' అంటూ కిసుక్కున నవ్వాడు వ్యంగ్యంగా.

పాపం, ఆయన అంత శ్రమపడి చేసిన హేళనకి ఏమాత్రం ప్రాధాన్యం ఇయ్యకుండా, బెంచీలో సగం చోటుని సులువుగా ఆబరించుకొని విందుగా కూర్చున్న ఆ సుకుమారి, తన రవ్వలదుద్దుల సీలల్ని ఓ మారు గట్టిగా తిప్పుకుని, కొత్తగా చేయించుకొన్న పాళ్లగాజుల జతల్ని చేతిరుమాలుతో పోలిష్ చేసుకుంటూ 'బంగారం దర విజయవాడలో ఎలా ఉందో!' అంది, తనలో తను అనుకున్నట్లుగా పైకి

ఇంక అవతల బెంచీమీద సరిగ్గా నాకు ఎదురుగా నాలాగే కిటికీ ప్రక్కనే కూర్చుని లుంగీ జుబ్బా వేసుకునిఉన్న ఆసామీ లేచి, గోదాలోకి దిగే వస్తాదులాగ, లుంగీనోమారు గట్టిగా బిగించి, టెక్కట్లో చిల్లర డబ్బులూ తీసి చూసుకొని, తిరిగి జేబులో

వేసుకుంటూ 'ఈ విజయవాడ స్టేషన్‌లో అన్నం పేకెట్లు దొరుకుతాయో లేవో' అని తనలో తనోమారు అరవంలో గొణుక్కొని తిరిగి యథాస్థానంలో కూర్చున్నాడు.

అతనిపక్కనే ఖరీదైన ఇరుకు పేంటుతోనూ, పొట్టి టెర్లిన్ షర్టుతోనూ ఇమడలేక తెగ అవస్థపడుతున్నా', పైకి మాత్రం విలాసంగా కూర్చోడానికి ప్రయత్నం చేస్తూ, ఉన్న అరడజను అగ్గిపుల్లలు గీసి అలవాటులేని సిగరెట్టుని కాల్చడానికి నానా యాతనాపడుతూన్న కాలేజీ విద్యార్థి, తన ఎయిర్ బేగ్ బుజానికి తగిలించుకుంటున్నాడు విజయవాడలో దిగడానికి కాబోలు.

ఆ విద్యార్థిపక్కని కూచుని అప్పటిదాకా హనుమాన్ చాలీసా చదువుకుంటూన్న 'బీహారీ' ఆ పుస్తకాన్ని కళ్లకద్దుకొని సంచీలో పెట్టుకుంటూ పక్కనే సిగరెట్టు కాలుస్తూన్న అబ్బాయిని చూసి మొహం ఓమారు చిట్లించి, జేబులోంచి రెండు పైసల నాణెం ఓటి తీసి, కింద నిండుగా ప్రవహిస్తూన్న కృష్ణలో వేసి దణ్ణం పెట్టి, స్మితంగా స్వీట్లు కట్టిన మూటని విప్పుకొసాగాడు తినే టైము అయిందనుకుంటూ—

ఇలా తలోరకం తలోక రకంగా సర్దుకునే లోపుగా స్టేషన్ రానేవచ్చింది; కీచ్... చ్...చ్...మంటూ ఆగిన రైలుశబ్దంతో పాటు అంతా ఒక్కసారు ముందుకి తూలి పడ్డాము!

హమ్మయ్య

ఎప్పటినుంచో ఎదురు చూస్తూన్న అవకాశం ఇప్పటికి లభించిందికదా, అని ఆతురతగా కిటికీలోంచి తలదూర్చి చూద్దును కదా, ప్లాట్‌ఫారం కనిపించలేదు.

అయ్యో ప్లాట్‌ఫారం అటు! సందడి అంతా అటేఅన్నమాట!

ఇటు నేను కూర్చున్న కిటికీవైపు నిర్జనమైన స్మశానంలా, సందడిలేని లోతైన ఓ నల్లని అగాధం. ఈ అగాధానికి బారెడు దూరంలో, మసకచీకటిలో నల్లతాచుల్లా మెరుస్తూన్న ఇంకో లైనుతాలూకు రైలు పట్టాలు. ఇంకా వాటిమీదికి అటునుంచి రావలసిన సర్కార్ ఎక్స్‌ప్రెస్ రాలేనట్టుంది. అందుకే అవి అంతలోతున మెరుస్తూ శూన్యంగా భయంగా—

అప్పుడే వాన కురిసి వెలిసిందేమో, రాక్షసి బొగ్గు రవ్వలుపడి నల్లగామారిన నేలంతా తడితడిగా అయి, రైలుపొగా తడి మట్టివాసనలతో నిండి, అంతా చిరాగ్గానూ, అసహ్యంగానూ ఉంది. చెదురు మదురుగా వెలుగుపడుతూ, కొండచిలువ ఒళ్లులాగా పొడలు పొడలుగా మెరుస్తూన్న ఆలోతైన చీకటిని చూడలేక, తలతిప్పి అటువేపు ప్లాట్‌ఫారం కేసి చూశాను.

ఓ!... బ్రహ్మాండమైన జీవశక్తితో కూడిన కోలాహలం!

పళ్లు ఫలహారాల, కిళ్లీసిగరెట్ల బళ్లూ, వచ్చిపోయే పెట్టె బెడ్డింగులూ, వాటిని తప్పించుకుంటూ ఒకళ్లనొకళ్లు తోసుకుంటూ కంగారుగా హడావుడిగా పరుగులెట్టే ఖరీదైన టెర్లిన్‌షర్టులూ, నీలం చొక్కాల ఎర్రతలపాగాలూ, ఆ వెనకాలే హంస నడకలు నడుచుకుంటూ వెళ్లే రంగు రంగుల చీరలూ, ఫేస్‌పౌడరు కళ తప్పిన ప్రయాణపు మొహాలూ, అమ్మకాల అరుపులూ, ప్రయాణీకుల కేకలూ, పెద్దల హెచ్చరికలూ, మధ్యలో నలిగిపోతూన్న పిల్లల ఏడుపులూ, ఇంజన్లకూతలూ వచ్చే పోయే రైళ్లచప్పుళ్లూ వీటితో రణగొణ ధ్వనిగా తుఫాను వచ్చిన మహాసముద్రంలా మాంచి అల్లకల్లోలంగా ఉంది ప్లాట్‌ఫారం.

ఎక్కే దిగే జనం రద్దీ అంతగా లేక తాపీగా ఉన్న మా స్లీపర్ కోచ్‌కి, ఒకవైపున ఇంత జీవ చైతన్యమూ, యింకోవైపున అంత నిర్జీవ నిశ్శబ్దమూనా? ఎంత వ్యత్యాసం!

విద్యార్థి కాళీచేసి దిగిపోయిన సీటులోకి యింకా ఎవరూ రాలేదు. నా ఎదురుగా కూచున్న అరవ ఆసామీ, అటు ప్లాట్‌ఫారం వైపు అమ్ముతూన్న ఓ 'తైర్ సాదం' పేకెట్ కొని తెచ్చుకొని తన సీటులో కూర్చుని విప్పుకుంటున్నాడు...అతని ప్రక్కనున్న బీహారీ, మఠం వేసుకుని ఎడంచేత్తో కుడిసీలమండమీద విలాసంగా పావుకుంటూ, కుడిచేతిలోని మైసూరుపాకం యొక్క మాధుర్యాన్ని అర మోడ్పు కన్నులలో ఆస్వాదిస్తున్నాడు.

ఇక నా పక్కన కూర్చున్న సిల్కులాల్చీ ఆయన, అప్పుడే కేరియర్ తీసుకు వచ్చిన బావమరిదికి వెండి మరచెంబు అందించి మంచినీళ్లు తెమ్మని ఆజ్ఞాపిస్తే, అతని భార్య ఆ అల్యూమినం కేరియర్ కేసి చిరాగ్గా ఓమారు చూసి 'ఈ దిక్కుమాలిన కేరియర్ తప్ప వీడి కింకేం దొరకలేదు కాబోలు' అంటూ విసుక్కుని, కేరియర్ విప్పసాగింది.

చుట్టూ ఉన్న నలుగురూ భోజనం చేస్తూంటే, చెయ్యిని నేను అక్కడ ఉండడానికి మొహమాటం వేసింది. పైగా ప్లాట్ ఫారంమీద వెల్లివిరుస్తూన్న ఉల్లాసం చెయ్యెత్తి పిలుస్తోంది, వచ్చి నువ్వు కూడా ఇందులో పాలుపంచుకోమని. నాకు అలాంటి రద్దీలో భాగస్వామి కావడం కూడా సరదాయే. అందుకే అలా ప్లాట్‌ఫారం మీదకి వెళ్లి ఆ వాతావరణంలో ఓమారు తృప్తిదీరా గాలి పీల్చి వద్దాం అని లేవబోయాను.

కాని ఇంతలో నా ఊపిరి స్థంభింపచేసేటంత భయంకరమైన మూలుగు వినిపించింది రైలుకి ఇటువైపునుంచి. నా ఎదురుగుండా ఉన్న అరవ ఆసామీ వెంటనే కంగారుగా కిటికీవేపు వీపుతిప్పేసి అటు తిరిగి, గబగబా, తైరుసాదం ముద్దలు నోట్లో కుక్కుకోసాగాడు.

ఆ మూలుగేమిటో, ఏమి చూసి ఈ అరవ ఆసామీ గతుక్కుమని మొహం తిప్పేసుకున్నాడో, అనే కుతూహలంతో వంగి కిటికీలోంచి వెలుగు చీకట్లవలలా ఉన్న ఆ అగాధంలోకి చూద్దునుగదా—

నల్లని ఓ మానవాకారం ఆ మసకచీకట్లో మెదిలింది. అంత లోతున నిలబడి ఇంత ఎత్తున కూచున్న మాకేసి చేతులు జాపి ఏదో ప్రాధేయపడుతూంది. పరిశీలనగా చూశాను. నేను కూర్చున్న పెట్టెలోంచి కిటికీగుండా బయటికి ఆ ఆకారంమీదికి పడుతూన్న వెలుగు సహాయంతో మరీ చూశాను.

ఆ వెలుగులో, నల్లగా ఓ పన్నెండేళ్ల ముష్టి కుర్రాడు!

మాగిళ్లు కట్టిన చింపిరి జుట్టూ— కిటికీ వైపు ఆబగా ఆశగా చూస్తూన్న లోతు కళ్లూ — నీరసంగా పీక్కుపోయిన మొహం. వెనుక్కి అంటుకుపోయిన పొట్ట మీద నిలవలేక జారుతూన్న చిరుగుల నిక్కరూను.

వాడిదృష్టి ఇటు నా వైపులేదు. అటు అరవ ఆసామీ వీపు కనిపిస్తూన్న కిటికీ వేపే ఉంది. ఓ చేత్తో నిక్కరు పైకి

లొక్కుంటూ రెండో చేతిని అంతవిత్తులో ఉన్న కిటికీవేపుగా జాపుతున్నాడు.

మళ్ళీ ఇందాకటి మూలుగే వినిపించింది.

అయితే, మరి కొంచెం స్పష్టంగా, ఇంకొంచెం గట్టిగా—నూతిలోంచి వచ్చినట్లు బరువుగా అస్పష్టంగా వినిపిస్తూన్న ఆ మూలుగు ఈ కుర్రాడిదే అన్నమాట!... శ్రద్ధపెట్టి జాగ్రత్తగా విన్నాను.

'బాబయ్యా...ఓ ముద్ద వెయ్యిబాబయ్యా!'

వాడు అదే శబ్దాన్ని హెచ్చించి మళ్ళీ మళ్ళీ గబగబా అంటున్నాడు. వాడి ఆకారాన్ని వాడు అంటూన్న మాటనీ చోద్యంగా చూస్తూ వింటూ కూర్చున్నాను.

ఆ ముష్టి కుర్రాడి పోరు ఎక్కువ కావడంతో ఆ అరవ ఆయన, వెనక్కి తిరిగి వాడికేసి ఓ మారు చూసి, వాడికి కనిపించకుండా ఉండడంకోసం అని బాగా లోపరికి జరిగి కూర్చుని, పెద్ద పెద్ద ముద్దలు చేసుకొని గబగబా మింగెయ్యడం ప్రారంభించాడు.

ఆ ముష్టి కుర్రాడు భలే గడుసువాడిలా ఉన్నాడు. అంతటితో ఆయన్ని వదలలేదు.

మా పెట్టికి బాగా దూరంగా వెనక్కి నడిచివెళ్ళాడు. కాళ్ళు ఎత్తిచూశాడు, అన్నం తినే అరవ ఆయన ఇంకా కనిపించలేదు కాబోలు, కాళీగా ఉన్న రైలు పట్టాలు ఎక్కి మరీ చూశాడు. దాంతో వాడికి ఒక అరవ అతనే కాదు అతని ప్రక్కని స్వీట్సు తింటూన్న బీహారీ, నా ప్రక్కని ఉన్న సిల్కు లాల్చీ ఆయనా, ఆయన భార్యకూడా కనిపించి ఉంటారు. ఇంక అరవ అతణ్ణి అడగడం మానేసి 'ఓ ముక్క పెట్టు బాబయ్యా ఓ ముద్ద పెట్టు అమ్మా' అంటూ, ఇందాకటిలా మూలగడం కాకుండా, గట్టిగా ఝుంకారంగా అరవడం మొదలుపెట్టాడు.

ఆ అరుపు విని అదిరిపడి, వాడి కళ్ళు సూటిగా వచ్చి తన మైసూరుపాకం మీదే పడుతున్నాయని గ్రహించి, వెంటనే బీహారీ కంగారుగా మొత్తం ముక్కనంతా నోట్లో వేసుకుని మిగిలిన స్వీట్లు గబగబా మూట కట్టేశాడు.

'ఏం భోజనం వీడి మొహం! ఓ శుభ్రమైన కూరాలేదు, పెరుగూలేదు ఏదే ముష్టివెధవకో పడేసి, మనమో రెండు భోజనాలు రిఫ్రెష్‌మెంటులోంచి తెప్పించుకుంటే బాగుండిపోను' అంది విసు

## ఆకలి

క్కుంటూ ఆ సిల్కులాల్చీ ఆయన భార్య.

'అమ్మా! ఓ ముద్ద అమ్మా!'

మళ్ళీ అరిచాడు ముష్టివాడు.

కంగారుగా, వాడి కళ్ళకి కేరియర్ కనిపించకుండా అటు పెట్టేసుకుంది ఆమె.

సిల్కులాల్చీ ఆయన కోపంగా వాడికేసి 'ఫో! ఫో!' అన్నాడు.

బీహారీ ఆయన మళ్ళీ హనుమాన్ చాలీసా తీసి నిర్మలమైన మనస్సుతో తిరిగి చదువుకోవడం ప్రారంభించాడు. అరవ అతను మాత్రం తిరిగి తిరిగి వెనక్కి ముష్టి కుర్రాడికేసి చూస్తూ తింటూన్న తైరు సాదం ముద్దలు నోటికి పోక అవస్థపడుతున్నాడు.

ముష్టికుర్రాడి ఆగడం క్షణక్షణానికీ ఎక్కువ కాసాగింది. వాడు రైలుబడ్డెమీద నుంచుని యింకాకాళ్ళు పైకెత్తి చూస్తూ 'అమ్మా ఓ ముద్ద! అమ్మా ఓ ముద్ద!' అంటూ గుండె లవిసేలాగ పిచ్చిగా అరుస్తున్నాడు.

సిల్కులాల్చీ ఆయన కోపంతో రెచ్చిపోయాడు. ఆ కోపంతో వళ్ళు తెలియని ఆవేశం తెచ్చుకుని మాటిమాటికీ భార్యని హెచ్చరిస్తూ, తానూ ఆమే కలిసి, కేరియర్‌లో అన్నాన్ని గబగబా తినేయసాగారు. కళ్ళతో మధ్య మధ్య ముష్టి కుర్రాడిని నంచుకుంటూ. వాళ్ళు అలా వెర్రిగా తినడం చూస్తే, ఆ కుర్రాడికి మరీ ఆకలి దహించుకుపోయినట్లుంది. 'అమ్మా ... బాబూ ...' అంటూ శోషవచ్చేలాగ అరవడం ప్రారంభించాడు. మధ్యలో పాపం ఆ అరవ ఆసామీ నలిగిపోతున్నాడు. ముష్టాడి కేకలు వింటూంటే అతనికి ముద్ద నోట్లోకి వెళ్ళడంలేదు. అంతా ఆ దంపతు లిద్దరూ తినేస్తే ఇంక తనకెక్కడ మిగలదో అని గబగబా అరిచేస్తున్నాడు ఆ కుర్రాడు 'అమ్మా...అమ్మా' అంటూ, ఇంక మీరు తినడం చాలులెండి. నాకు పెట్టండి అనే అర్థం వచ్చేలాగ.

సిల్కు లాల్చీ ఆయన హుంకరిస్తూ లేచి కిటికీగుండా, చంపేస్తానన్నట్లు ఆ కుర్రాడి కేసి చూసి, 'నువ్వు అర్చి చచ్చినా పెట్టం. అరవకుండా అవతలకి ఫో...ఒకటే అరుపు ఒకటే అరుపు, స్థిమితంగా రెండు ముద్దలు తిననియ్యకుండా... మరీ పొగరు ఎక్కువైపోయింది ప్రతి ముష్టి వెధవకీ' అంటూ సింహంలా గర్జించి అదే ఊపులో నాకేసి తిరిగి 'కిటికీ వేసెయ్యండీ!' అన్నాడు. ఆ మాటే ఆయన సౌమ్యంగా అంటే ఒకవేళ వేసిఉందునేమో!

అటు ఆకలికీ ఇటు అన్నానికీ మధ్య నున్న తలుపు మూసెయ్యలేక, అలాగని చేసేదీలేక నిస్సహాయంగా చూస్తూ కూర్చున్నాను.

అంతటితో నిరుత్సాహం చెందే కుర్రాడు కాదు వాడు—ఇలాంటి కేకలు ఎన్ని విన్నాడో, ఇలాంటి అవమానాలు ఎన్ని పడ్డాడో!... అసలేం జరగనట్లు మళ్ళీ మామూలుగా 'అమ్మా ఓ ముద్ద!' అంటూ అరిచాడు.

అలా ఒక్క ఎరసని తన వీపు వెనకాల అరుస్తూంటే, తనని కాదులే అని ఎంత సేపు ఊరుకోగలడు ఆ అరవ ఆయన మాత్రం?... ఎంత ప్రయత్నించినా ఆయన నోటికి ముద్ద ఎక్కడంలేదు.

ఆయనలో ఇంకా సజీవుడుగా ఉన్న మానవుణ్ణి చూసి నేను చిరునవ్వు నవ్వాను.

నా నవ్వు చూసి మొదట కళవళపడి, ఆ తర్వాత తనూ తేలిగ్గా నవ్వేస్తూ, అరవయాసతో కూడిన దక్షిణాది తెలుగులో 'వీండ్లు నిండా గడుసువాళ్ళండీ!... తింటూంటే అడిగి తొందర పెడితే, వీండ్లకి పెట్టకుండా ఎట్లా తిందుము! కష్టంకదా?' అన్నాడు.

ఆయనలోని మంచితనం చూస్తే నాకు మళ్ళీ నవ్వువచ్చింది.

'ఈ సాదం కూడా ఏం రుచిలేదు... దుడ్లు తీసుకున్నాడు కాని మోసం...'

తర్వాత ఆయన ఏంచేస్తాడో నేను వెంటనే ఊహించాను. సరిగ్గా ఆయన అలాగే చేశాడు. మిగిలిన అన్నం అంతా ఆకులో చుట్టిపెట్టి గట్టిగా ఆ ముష్టి కుర్రాడిదగ్గర పడేలా విసిరాడు. కాని ఆ కుర్రాడి దృష్టి యింకా ఆశగా సిల్కులాల్చీ దంపతులవేపే ఉందేమో, ఆ పొట్లం వచ్చి తనకి కొంచెం పక్కగా పడినప్పుడు విని పిస్తేనేకాని అటు చూడలేదు.

కళ్ళు జిగేల్ మన్నాయి!

రెండు పట్టాలమధ్యనా ఉన్న ఆ [illegible] మీద దివ్యకాంతి ఏదో వచ్చిపడింది. ఇంతలో ఆ పొట్లాన్ని చిక్కించుకుపోవడంకోసం ఎక్కడినుంచో ఓ కుక్క వచ్చి ఉరికింది.

వాడిలోని ఆకలి ఇంజనులా గర్జించి, గుండె రైలుచప్పుడులా కొట్టుకుంది.

కుక్క!

అన్నం!

కాంతి — చప్పుడు —

అమ్మో!...కుక్కతో పోటీపడి అన్నం పొట్లం మీదకి ఒక్కమాటుగా ఉరికాడు. పొట్లం దొరికింది. కుక్క పారిపోయింది. నల్లని ముష్టి కుర్రాడిమీద ఓ మెరుపులా మెరిసి, ఓ ఉరుము ఉరిమింది. అంతే!

*　　　*　　　*

గుండెలు బిద్దలయ్యే ముష్టికుర్రాడి పచ్చికేక! మృత్యువులా ముందుకు దూసుకుపోయిన సర్కార్ ఎక్స్‌ప్రెస్ —

అంతా ఒక్క క్షణంలో—ఒక్కక్షణంలో—

నుతిపోయి సీటుకి కరుచుకుపోయాను నేను!

నాతోపాటు ఆ దృశ్యాన్ని చూసిన ఆ అరవ ఆయన భయంకరంగా ఒక్క పొలి కేక పెట్టాడు!

అప్పుడే భోజనం పూర్తిచేసి త్రేపుమని త్రేనుస్తూన్న సిల్కు లాల్చీ ఆయన, నిస్తేజులుగా ఉండిపోయిన మా యిద్దరినీ, పక్క లైనుమీదికి మహావేగంగా వచ్చి ఆగుతూన్న సర్కార్ ఎక్స్‌ప్రెస్‌నీ ఒక్కమారు చూసి, క్షణంలో అంతా గ్రహించి 'ఎంతపని చేశావయ్యా ఆ అన్నం పొట్లం విసిరి?' అంటూ అరవ ఆతణ్ణి హంతకుణ్ణి చూసినట్లు చూశాడు.

సర్కార్ ఎక్స్‌ప్రెస్ బాగా ముందుకు వెళ్ళి ఆగింది.

ముష్టి కుర్రాడి స్థానంలో, మాంసం ముద్దా, రక్తపు మడుగూ, అన్నం పేకట్‌ని గుప్పిడితో గట్టిగా పట్టుకొన్న ఒక చెయ్యీ మాత్రం మిగిలాయి.

ఎంతటి భయంకరమైన దృశ్యాన్నయినా సరదాగా చూడగలననుకొన్న నాకు, తల గిర్రున తిరిగిపోయింది.

పాపం అరవ ఆసామీకి తిన్న అన్నం అంతా వాంతి అయిపోయింది.

'ఆ దృశ్యం మనం చూడలేం' అంటూ సిల్కు లాల్చీ ఆయనా, ఆయిన భార్యా ముఖం అటు తిప్పుకొని కూర్చున్నారు.

రైలుపట్టాల మధ్య కుప్పగా పడిఉన్న ఆ మాంసపు ముద్దచుట్టూ కాకుల్లా జేరిన జనాన్ని చూచి, జరిగింది ఏమిటో అర్థంకాక, నోటిదాకా వచ్చిన అన్నం దక్కకుండా పోయినందుకు బాధగా జనం మధ్యనున్న అన్నం పేకెట్‌కేసి ఆశగా చూస్తోంది తన ఆకలి సమస్య ఇంకా తీరని కుక్క!

'మానవుడు కనుక్కొన్న యంత్రాలం మేం—తీరిస్తే కృతజ్ఞతతో అతని సమస్యని తీరుస్తాం కాని నీ సమస్యలు తీర్చేదాకా మాకేం?' అని కసిరినట్లు కూసి తన తోటి ఎక్స్‌ప్రెస్ చేసిన పనిని వెనకేసుకు వస్తూ, నీరసంగా కదిలింది మా ఎక్స్‌ప్రెస్, తన ఆకలి యింకా తీరకపోవడంవల్ల హౌరాదాకా ఉన్న రైలుమార్గాన్నంతా మింగెయ్యాలనే ఆశతో.

ఆ తర్వాత కొంతసేపటికి కూత కూసి సర్కార్ ఎక్స్‌ప్రెస్ కూడా కదిలే వుంటుంది, కడుపునిండిన రాక్షసి, త్రేవుమని త్రేన్చుకుంటూ బద్ధకంగా బయలుదేరినట్లు.

అందరికీ అన్నం పెట్టే అన్నపూర్ణ లాంటి ప్రకాశం బేరేజీ, దాన్ని చూసికూడా బహుశా నవ్వేవుంటుంది తన మెర్క్యురీ కాంతులో. ●



# రష్యన్ ఛలోక్తులు

...సోవియట్ యూనియన్‌లో విద్యా విధానం గమ్మత్తుగా ఉంటుంది. ఇక్కడ మనలాగ మార్కులు ఇవ్వరు. క్లాసులు మాత్రమే (అంటే ఫస్టు, సెకండు, థర్డు క్లాసులు) ఒక పుస్తకంలో వ్రాసి ఇస్తారు. ఈ పుస్తకం ఎప్పుడూ విద్యార్థి దగ్గరే ఉంటుంది. ఒక క్లాసులో కొంచెం పెంకి ఘటం అయిన ఒక విద్యార్థి ఉండేవాడు. రోజూ ప్రొఫెసర్‌ని ఏదో తిక్క ప్రశ్నలు వేసి గలాటా చేస్తూ ఉండేవాడు. సరే పరీక్షలు రానేవచ్చాయి. ప్రొఫెసరుగారు పరీక్షలు తీసుకొంటున్నారు. మనవాడివంతు వచ్చినప్పుడు అడగవలసిన ప్రశ్నలు అడిగి, పుస్తకం తీసుకొని మార్కులు వ్రాశేసి ఇచ్చేశాడు. విద్యార్థికి కూడా థర్డుక్లాసే ఇస్తాడని తెలుసు. బయట వరండాలో స్నేహితు డొకడు కలసి 'ఏంరా! ఏ క్లాసు వచ్చింది' అని అడిగాడు. 'ఆ ఏం ఉంది! మామూలే థర్డు క్లాసు ఇచ్చి ఉంటాడు,' అంటూ పుస్తకం అందించాడు పరీక్ష ఇచ్చిన విద్యార్థి. అందులో ఇంతకీ వ్రాసి ఉన్నది 'గాడిద' అని 'ఒరే ఇదేంటి?' స్నేహితుడు ఆశ్చర్యంగా చూపెట్టేడు. అది చూసి, పరీక్ష ఇచ్చిన విద్యార్థి 'ఉండు ఇప్పుడే వస్తా' అంటూ ప్రొఫెసరు దగ్గరకు పరిగెత్తి 'సార్! మీరు మార్కులువెయ్యడం మరచిపోయి ఒక్క సంతకం మాత్రం పెట్టి ఇచ్చేశారు పుస్తకం' అంటూ తిరిగి పుస్తకం అందించాడు ప్రొఫెసరుకు విద్యార్థి.

* * *

ఒక మామ్మగారు మనవడిని తిడుతూ ఇలా అంది. 'వెధవా! ఎన్నిసార్లు చెప్పాలి, చెడుగా నడుచుకొంటే నరకంలో పడతావని, మంచిగా నడచుకొంటే స్వర్గంలో పడతావని.' కుర్రవాడు ఏం మాట్లాడలేదు. 'ఏం? ఏంటాలోచిస్తున్నావు? ఇకనైనా మంచిగా నడచుకొంటావా'? మనవడు:— 'అదికాదు మామ్మా, ఏ విధంగా నడుచుకొంటే, నే నిప్పుడు సినిమాహాలులో పడతానో నీవు చెప్పలేదేం?'

* * *

ఒక ఆఫీసులో గుమస్తా ముందు ఒక వ్యక్తి 40 రూబుళ్లు పెట్టేడు. గుమస్తా:— 'ఏంటిది? లంచం తీసుకో మంటారా?' వ్యక్తి:— 'అమ్మమ్మ! ఎంత మాటన్నారు. ఇది లంచమా? ఇది మీ పుట్టినదినానికి నా స్వల్ప బహుమానం.' గుమస్తా:— 'నా పుట్టినరోజు ఇంకా తొమ్మిదినెలల తరువాతగా?' వ్యక్తి:— 'మీ రంతవరకు దీనిని ఖర్చు పెట్టకండి!'

* * *

పరీక్షలో ఒక విద్యార్థిని మాష్టరుగారు ఇలా ప్రశ్నించారు. 'ఏంవోయ్! చేప జీవిత చరిత్ర చెప్పు?' విద్యార్థి:—

'సముద్రపు చేప జీవిత చరిత్ర చెప్పుతాను సార్?'

'సరే అలాగే కాని ఏదైతేనేం?'

'మీరు సరిగ్గా క్లాసులో చెప్పినట్టే చెపుతాను సార్!'

'ఓ! అలాగే చెప్పు'

'సముద్రపు చేప జీవితచరిత్ర, మంచి నీటిచేప జీవితచరిత్రనే పోలిఉంటుంది' అని చెప్పారు సార్!' అని విద్యార్థి జవాబు.

* * *

సోవియట్ యూనియన్‌లో పెద్ద పెద్ద నగరాలలో సంచార పోలీసుదళాలు ఉంటాయి. వాటి వెన్నుపైని 'మీ కంప్లయింటులు (అభియోగాలు) ఇక్కడ చేయండి.' అని ప్రజల సౌకర్యార్థం బోర్డులు వ్రాసి పెడతారు. ఒకదినం ఒక వ్యక్తి రోడ్డుపై తూలుతూ... వస్తున్నాడు. అకస్మాత్తుగా



గొరిల్లా కవలలకి నామకరణం చేయడానికి వెళ్లిన జెర్మన్ కెబ్లర్ కవలలు. వీరు అమెరికా, ఇటలీ పర్యటనల కార్యక్రమాన్ని వాయిదా వేసుకొని యిటీవల ఫ్రాంక్ ఫర్ట్‌కి వెళ్లారు.

రోడ్డు ప్రక్కనే ఉన్న పోలీసుదళపు కారుని చూచాడు. తరువాత అక్కడే ఏదో వస్తువు రోడ్డుపై వంగి వెతకడం ప్రారంభించాడు. దూరంనున్న పోలీసు ఇది గమనించి ఇతని దగ్గరకు వచ్చి ప్రశ్నించాడు 'ఏమయ్యా ఏమిటి పారేసుకొన్నావు? అక్కడకు వెళ్ళి కంప్లయింటు చెయ్యకూడదా' వ్యక్తి:— 'అబ్బే! అది మీకు దొరకదండి'. పో: 'ఏమిటి పారేసుకొన్నావంటూంటే?' వ్యక్తి— 'లాభంలేదండి. చెప్పాను కదండి మీకు దొరకదని' పో:— ఇంతకీ చెప్తే చెప్పు లేకపోతేలేదు.' 'అయితే చెప్పమంటారా! నా నిలకడ పోయిందండి' అన్నాడు వ్యక్తి.

*　　*　　*

ఒక బార్‌లోకి ఒక పెద్దమనిషి ప్రవేశించాడు. బార్‌లో అసలు వ్యక్తులు లేరు. కౌంటరు ప్రక్కనే ఒక వ్యక్తి చేతిలో బాటిల్‌తో బోర్లా పడుకొని పాటలు పాడుతున్నాడు పెద్దమనిషి కౌంటరు దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. కౌంటరులో ఉన్న యజమాని వచ్చి 'ఏం ఇయ్యమంటారు సార్?' అన్నాడు. ఒక్క నిముషం ఆలోచించిన పెద్దమనిషి 'నాకు కూడా అటువంటిదే ఒకటి' అన్నాడు మెల్లిగా, క్రింద పడుకొన్న వ్యక్తిని చూపిస్తూ!

*　　*　　*

ఒక పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడుతున్న పెద్ద వ్యవసాయ శాస్త్రవేత్త ఈ క్రిందివిధంగా ప్రకటించారు. 'ఇరువది సంవత్సరాలు మేము అధిక కృషి చేసి జరిపిన పరిశోధనవలన మేము ఈ నాడు చక్కని ఫలితాలను సాధించాము. ఇన్ని సంవత్సరముల తరువాత ఈనాటికి మేము ఏపిల్ చెట్లపై పియర్సుపండ్లు, పియర్సు చెట్లపై యాపిలు పండ్లు పండిస్తున్నాము.'

*　　*　　*

ఒక ఉపన్యాసం జరుగుతోంది. సభావేదికపై కూర్చున్న ఒక వ్యక్తి రెండవ వ్యక్తితో సభాధ్యక్షుని చూపుతూ ఇలా అన్నాడు 'ఎప్పుడూ ఎందుకు ఇతడినే సభాధ్యక్షుడుగా ఎన్నుకుంటారు? రెండవ వ్యక్తి 'ఎందుకేమిటి! ఇక్కడ ప్రతివాడు గంటలతరబడి చదివే ఊకదంపుడు ఉపన్యాసాలు ఓపికగా, ఎప్పుడూ చిరునవ్వు ముఖంతో చక్కగా వినడం చాతనవును కాబట్టి.'

—టి. ఎస్. సుబ్రహ్మణ్యం
(స్నేహవిశ్వవిద్యాలయం, మాస్కో) ●



# జీవ[illegible]

## ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరిలోకి పెద్దగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిదే యాజమాన్యం. వసంత నిరంజనం కూతురు. పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్ళవుతుంది సీతమ్మగారి జ్వరం ఆమె ప్రాణాల్ని తీసుకుంది. వసంతా సుధ నెత్తిమీద పడుతుంది. ఒకరోజు సుధవాళ్ళ మామయ్య వస్తాడు తర్వాత, సుధలో కొత్త మార్పు వస్తుంది మధుని లెక్చరరు ఉద్యోగం విడిచిపెట్టి ఇతర ప్రయత్నాలు చెయ్యమంటుంది. ఆమె మాటల్ని మధు లెక్క చెయ్యలేదు. సుధ మామగార్ని సూటిపోటి మాటలనడం ప్రారంభిస్తుంది నిరంజనం క్రుంగిపోయి గతాన్ని గుర్తుచేసుకుంటాడు కొత్త యిల్లు కట్టించి దానికి మారితేగాని తన జబ్బు తగ్గదని ప్రాధేయపడుతుంది మీనాక్షి. మీనాక్షిని రక్షించుకోవాలని నిరంజనం చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమై ఓ నాటి ఉదయాన శాశ్వతంగా కన్ను మూస్తుంది మీనాక్షి.

## 15

నాలుగు సుదీర్ఘమైన సంవత్సరాలు అలా తన ఎదురుగా మంచంమీద పడుకుని, నిరాశ కలిగినప్పుడల్లా తను నాలుగు మాటలు చెప్తే ఉత్సాహం తెచ్చుకుంటూ పసిపిల్లలాగే మాలిమి అయిపోయిన భార్యని మరచిపోవటం నిరంజనానికి సాధ్యం కాలేదు.

అందరికీ అతనిచ్చిన సమాధానం, 'ఇప్పుడు నా మనస్సేమీ బాగుండలేదు. నన్ను విసిగించకండి.' అని.

కాలగతిలో అనేక గాయాలు మాసిపోతాయి. కాలానికి ఆ శక్తి లేకపోతే, జరిగినవాటిని తలుచుకుంటూ ఏడవటానికే మనిషి జీవితం అంతా సరిపోతుందేమో—కొన్నాళ్ళ తరువాత నిరంజనంకూడ తన దుఃఖాన్ని కొంతవరకు మరిచిపోయి మామూలు మనిషి అయాడు.

'నాకు అభ్యంతరంలేదు — కాని ఒక విషయంమాత్రం చాలా ముఖ్యం—మధు వసంతలని కన్న తల్లిలాగే ఆదరించగలగాలి.' అన్నాడతను.

అల్లుడి అభిప్రాయం తెలుసుకున్న సీతమ్మగారు కళ్ళు ముక్కు తుడుచుకుంటూ, 'రేపు నేను వెళ్ళిపోతాను బాబూ,' అంది ఏడుపుగొంతుకతో.

'అదేమిటి?' తెల్లబోయాడు నిరంజనం

'నా కూతురే లేకపోయిం తరువాత నాకీ యింటితో సంబంధం ఏముంది?!'

'మీ అమ్మాయి పోగానే నేను పరాయివాణ్ణయిపోయానా—పోనీ పిల్లలయినా మీవాళ్ళు కారా. ఇన్నాళ్ళు వాళ్ళని పెంచింది మీరే. వాళ్ళని వదిలి వెళ్ళిపోతాననటానికి మీ మనస్సెలా అంగీకరిస్తోంది. మీరున్నారు వాళ్ళని గురించి ఎలాంటి దిగులు నాకుండదని నిశ్చింతగా వుంటున్నాను—అయినా మీరు లేకపోతే వాళ్ళసలుండలేరు. వాళ్ళకోసం అయినా మీరిక్కడుండక తప్పదు.' అన్నాడు. అనేకమైన జ్ఞాపకాలతో అతని మనస్సు కలతబారిపోయింది.

'పిల్లల్ని వదిలి నేనయినా ఒక్కక్షణం వుండగలనా? ఆ మాటే చెప్దామనుకుంటున్నాను. ఎవరేం చెప్తే అది నమ్మి, ఏదోవిధంగా దాని ఆరోగ్యం కుదుటపడితే చాలుననుకుని, ఉన్న పొలం కాస్తా అమ్మి ఈ డాబా కట్టటానికి ఇచ్చాను. ఆ లెక్కలు అవీ నీదగ్గరే వున్నాయి. అది కాకుండా పిల్లలకి నువ్వు ఇవ్వదలచుకున్నది...'

'మీ రంటున్నదేమిటి?' ఆవిడ చెప్పేది పూర్తి కాకుండానే విస్మయంగా అడిగాడు.

'నువ్వు మరోలా అనుకోకు—ఇన్నాళ్ళు ఇది పరాయిచోటయినా నా బిడ్డ ఇల్లు అనే ధైర్యంతో స్వతంత్రంగానే వుండగలిగాను—ఇప్పుడు నా బిడ్డ స్థానంలో మరో ఆడది మసులుతూంటే నేను చూసి భరించలేను—రాబోయే సవతితల్లి దయాధర్మాలకి ఈ పసివాళ్ళని వదిలేసి వెళ్ళిపోనూలేను—' కొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ క్షణం ఆగింది సీతమ్మగారు. ఆవిడ ఆలోచనని అభిప్రాయాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నవాడిలా ఏటో చూస్తూ మౌనంగా కూర్చున్నాడు నిరంజనం.

'అందుకే వాళ్ళనికూడా నాతో తీసుకుపోతాను. జానెడు పొట్ట నింపుకోడానికయితే నాకున్నదే చాలు. వాళ్ళిద్దరి చదువులు సంధ్యలు అన్నీ చూసేటంత శక్తి నాకులేదు అయినా బోలెడు డబ్బు దస్కంగల తండ్రివుండి ఏమీ లేనివాళ్ళలా వాళ్ళని బ్రతకమనటం ధర్మం కూడదు. నీ పిల్లలకి ఏ లోటూ రాకుండా చూసే బాధ్యత నాది. వాళ్ళని నీకు కాకుండా చెయ్యాలనే ఉద్దేశ్యం నాకు లేదు — శలవలకి అప్పుడప్పుడు పంపిస్తూనేవుంటాను...'

'వీల్లేదు—వాళ్ళు నా దగ్గర వుండాల్సిందే.' ఆ మాటకి తిరుగులేదు అన్నట్లు స్థిరంగా వుంది అతని గొంతు.

'నీ పిల్లల విషయంలో జోక్యం కలిగించుకోటం నాది తప్పే కావచ్చు. కాని వాళ్ళని పెంచి పెద్దవాళ్ళని చేసేభారం నాదే అని చేతిలో చేయి వేయించుకుంది'.

'నాకు తెలుసు ఆ సంగతి. ఎలాంటి పరిస్థితులలోనూ పిల్లలని దూరం చేసుకోనని నేనూ తనకి మాటఇచ్చాను—వాళ్ళని వదిలి నేనూ వుండలేను మీరూ వుండలేరు — వాళ్ళకయినా నేనూ మీరు కూడ కావాలి అందుకే అందరం కలిసి ఇక్కడే వుందాం—ఇక్కడ్నించి వెళ్ళిపోతాననేమాట మరి అనకండి.'

'నువ్వు నా బాధ అర్థం చేసుకోటం లేదు—పోయిన భార్యస్థానంలో నీకు మరో భార్య వస్తుంది. కాని మారుటి తల్లి వాళ్లకి కన్న తల్లి అవుతుందా. జ్ఞానం వచ్చీరాని పిల్లలు ఎలాగో సరిపెట్టుకుందామన్నా ఆ పరాయిపిల్లని నా కూతురిలా నేను భావించుకోగలనా? నా కూతురు తిరగాల్సిన ఇంట్లో తిరుగుతూ నా బిడ్డ అనుభవించాల్సిన అదృష్టాన్ని మరో అమ్మగన్న పిల్ల అనుభవిస్తుంటే నేను చూస్తూ భరించగల నంటావా...' ఆవిడ మాటలు పూర్తికాకుండానే నిరంజనం గదిలోంచి వెళ్లిపోయాడు. అతని మనస్సంతా అల్లకల్లోలంగా వుంది. చనిపోయిన భార్యని గురించిన జ్ఞాపకాలు, ఆమె మాటలు హృదయంలో రగిలిస్తున్న ఆవేదనతోపాటు ముందు కర్తవ్యం ఏమిటో స్ఫురించక తలంతా వేడెక్కిపోయింది.

అలాగే రెండురోజులు గడిచిపోయాయి. మూడోనాడు తెల్లవారుతూనే పెద్దక్క బండి దిగింది.

'వాళ్ల వూళ్లోనే ఒక సంబంధం వుంది. పిల్ల అన్నివిధాల బాగుంటుంది బుద్ధిమంతురాలు. ఈ పిల్లల కెలాంటి కష్టం కలగదు. నిరంజనాన్ని తీసుకువెళ్లి పిల్లని చూపించి ఔననిపించాలని ఆవిడ ఉద్దేశ్యము. దాపరికంలేకుండా ఆ విషయం సీతమ్మగారితో కూడ చెప్పింది. అందుకు ఆవిడ చెప్పిన సమాధానం విని తెల్లబోయింది. సీతమ్మగారు ఎన్నిచెప్పినా ఏం చెప్పినా వాటి సారాంశం ఒక్కటే.

'అయినవాళ్లందరూ పూనుకుని అతని జీవితాన్ని చక్కదిద్దబోవటం మంచి సంగతే—అందుకు తన కెలాంటి అభ్యంతరం లేదు. అలా అభ్యంతర పెట్టే అధికారం కూడ తనకి లేదు—కాని తను కోరేది ఒక్కటే—తన మనవలకి ఎలాంటి అన్యాయం జరగటం తను సహించలేదు. మొదట్లో ఎంతో నెమ్మదిగా మంచిగా వున్నా క్రమంగా ఏకుమేకై సవితిపిల్లల్ని బాధిరంపాన పెట్టినవాళ్లని లక్షమందిని చూసింది తను. అందుకే ఇక్కడ్నించి వెళ్లిపోతుంది. పిల్లలకి ఏదో ఇంత ఇచ్చి తనతో పంపిస్తే వాళ్లకే లోటూ



రాకుండా పువ్వులలో పెట్టి పెంచుతుంది అలా కాదు వాళ్ళని పంపనూ అంటాడుగా దానికి అడ్డు చెప్పే అధికారం తనకి లేదు. కాని, పిల్లల్ని విడిచి తనూ తనని విడిచి వాళ్ళూ ఒక్క రోజయినా వుండలేరు — చచ్చిపోయిన మీనాక్షి మొహం గుర్తుకు తెచ్చుకొని ఆమె చివరిమాటలకి విలువనిచ్చి వాళ్ళని తనతో పంపేసెయ్యాలి.'

అదంతా చెప్పి, 'నీదే ప్రారబ్ధం. అడకత్తెరలో వక్కలా అయిపోయింది నీ బ్రతుకు,' అంటూ నెత్తి బాదుకుంది పెద్దక్క.

'మీనాక్షే లేనప్పుడు ఇంక తన మాటలకి విలువ ఏముంది? ఆవిడ ఈ ఇంట్లో వుండలేకపోతే మహారాణిలా వెళ్ళిపోవచ్చు—పిల్లలు ఆవిడకోసం బెంగ పెట్టుకోకుండా మూడోనాటికి తిప్పుకోగలను—ఆవిడ కివ్వాల్సిందేదో పారేస్తాను. ఇష్టం వచ్చిన దగ్గరికి వెళ్ళిపొమ్మని చెప్పు.' అనాలనిపించింది. కాని అందులో ఒక్క అక్షరం అయినా అతని గొంతు పెగిలిరాలేదు.

'నా పెళ్ళికి ఆవిడ పెత్తనం ఏమిటి మధ్య? ఇంట్లో ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోయి చడీ చప్పుడూ కాకుండా పెళ్ళి చేసుకు వచ్చాను.' అనుకున్నాడు.



కాని అలా చేస్తే రాగల పరిస్థితు లేమిటో తను వూహించుకోగలడు. ఇన్నాళ్ళ పరిచయంతోనూ సీతమ్మగారి మనస్తత్వం తను ఆ మాత్రం అర్థం చేసుకోగలడు. ఇంట్లో ఎవ్వరికీ శాంతి సౌఖ్యాలు లేని పరిస్థితులు సృష్టించగలదు ఆవిడ తనకీ, వచ్చిన భార్యకీ కూడ శాంతి లేకపోయాక ఇంక ఆ పెళ్ళి చేసుకుని అనుభవించే దేముంటుంది. లేని పోని మనస్తాపం కొని తెచ్చుకోట తప్ప— ఏమిటీ అంటే పిల్లల్ని తీసుకువెళ్ళిపోతానంటుంది. అది తనకి సమ్మతం కాదు—ఇంక ఈ సమస్యకి పరిష్కారం ఒక్కటే. తను మళ్ళీ వివాహం మాట తలపెట్టకపోవటం — తనకి సుఖం లేకపోయినా మిగతా వాళ్ళంతా సంతోషంగా వుంటేచాలు.' ఓ నిశ్చయానికి వచ్చిన నిరంజనం ఆ మాటే అక్కగారికి చెప్పాడు.

'మా అందరిలోకీ ప్రయోజకుడవని అదృష్టవంతుడవనీ మురిసిపోయాం. చివరికి నీ అదృష్టం ఇలా ముక్కలయింది — ఏ దుర్ముహూర్తంలో దాన్ని చూశావో బ్రతికివుండగా లేనేలేదు, తను చచ్చిపోయింతరువాత కూడ నిన్ను సుఖ



పడ నివ్వట లేదు' అని వాపోయిం దావిడ.

'నాకోసం తను ఎంత బాధపడేదో నీకు తెలియదక్కా — తనని అనుకోటం అన్యాయమే— నా జాతకమే ఇలా వుంది అని సరిపెట్టుకుంటే తీరిపోతుంది.'

'ఈ ముసలమ్మ శాశ్వతమా — ఇంత వండిపెట్టటానికి. పిల్లల్ని చూసుకోటానికయినా ఇంటికొక్కరు కావాలి కదా,' అంటూ నచ్చచెప్పబోయిందామె.

'ఎవరు మాత్రం శాశ్వతం అక్కా— ఎవరు ముందో ఎవరు వెనకో ఏం చెప్పలేం కదా—ఈనాడు వున్నవాళ్ళు హాయిగా జరిగిపోతుంది. ఈలోగా బాబుకి పెళ్ళిచేస్తే కోడలే అన్నీ చూసుకుంటుంది — ఈ ముసలివాడికి గుప్పెడు మెతుకులు పెట్టటం ఆ అమ్మాయికి శ్రమ అనిపించదులే—' అంటూ అక్కగారి మాటలని ఎగరగొట్టేశాడు. ఎంతచెప్పినా అతను మనస్సు తిప్పుకోలేదు—సీతమ్మగారి మూర్ఖత్వాన్ని తమ్ముడి అప్రయోజకత్వాన్ని నిందిస్తూ తిరుగు ప్రయాణం అయిందామె.

స్నేహితులూ అన్నగార్లూ కొన్నాళ్ళ పాటు చెప్పి చూశారు. చివరికి విసిగిపోయి వాళ్ళూ వూరుకున్నారు.

సాయంకాలం మామూలుగా షికారుకి బయలుదేరిన నిరంజనం దార్లో కనిపించిన మనిషిని అవునా కాదా అన్నట్టు ఆశ్చర్యంగా తేరిపారజూసి,

'ఈ వూళ్ళో వుంటున్నావా' అంటూ సంతోషంగా పలకరించాడు. చదువుకునే రోజులలో స్నేహం ఇద్దరికీ. బి.ఏ.తో మానేసి ఉద్యోగంలో పడ్డాడు చలపతి. ఆ తరువాత ఎవరిదారి వారిదయింది.

'ఓ నెలయిందిలే ఇక్కడికివచ్చి, నువ్వూ ఈ వూళ్ళోనే వుంటున్నావా' అన్నాడు చలపతి మొహంనిండా ఆనందం పులుముకుని.

'నేనా తరువాత లా చదివాను. ఇక్కడే ప్రాక్టీసు చేస్తున్నాను.' అన్నాడు నిరంజనం.

'బ్రతికావు హాయిగా నీకూ చింతలేని ఉద్యోగం—రెండుచేతులా సంపాదిస్తున్నావా లేదా—పిల్లలెంతమంది.'

'సంపాదన బాగానేవుందనుకో— ఇద్దరు పిల్లలు. అబ్బాయి ఫోర్త్‌ఫారం చదువు

# విస్మయజనక!



# గృహాలంకార గుడ్డలు

నిర్మించువారు




## మఫత్‌లాల్ గ్రూప్

న్యూశోరక్ (శోరక్) అహమదాబాద్ • న్యూశోరక్, నదియాద్ • స్టాండర్డ్, బొంబాయి • స్టాండర్డ్ (న్యూచైనా), బొంబాయి • స్టాండర్డ్, దేవాస్ • సాస్సూన బొంబాయి • సాస్సూన్ (న్యూయూనియన్), బొంబాయి • సూరత్ కాటన్, సూరత్ • మఫత్‌లాల్ ఫైన్, నవసారి. మిహిర్ టెక్స్‌టైల్స్, అహమదాబాద్.

M. 156-72

కున్నాడు. అమ్మాయి అయిదోక్లాసులో వుంది. అందర్నీచూసి ఆనందించే అర్ధాంగే లేదు' అన్నాడు నిరంజనం నిర్వేదం నింపిన గొంతుతో.

'అరే, ఎన్నాళ్ళయిందిపోయి' అంటూ సానుభూతి చూపించి వివరాలన్నీ తెలుసుకున్నాడు.

'పిల్లలు దూరం అయిపోతారేమోనని నువ్వు మళ్ళీ పెళ్ళిమాట తలపెట్టకుండా వున్నావంటే నాకెంతో ఆశ్చర్యంగా వుంది. నీ విషయం ఏమోకాని ఆ పిల్లలు, చచ్చిపోయిన మా చెల్లాయి కూడ చాల అదృష్టవంతురాలు — నువ్వు చేసిన త్యాగానికి నిన్ను అభినందిస్తున్నాను—...'

స్నేహితుడికి తెలియకుండా నిరాశగా నిట్టూర్చాడు నిరంజనం—

# జీవనరాగం

అసలు అతని ధోరణిని గమనించని వాడిలా చలపతి మళ్ళీ మొదలుపెట్టాడు.

'మా మరదలు అంటే మా ఆవిడ చెల్లెలు ఆ మధ్య పోయింది. ముగ్గురు పిల్లలు. అతను మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు — ఆవిడచెప్పిన మాటల్ని విని అతను ఆ పిల్లల్నిపెట్టే బాధలు చూస్తే పగవారికి కూడ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి—మీకంత భారంగా వుంటే నా దగ్గరికి పంపించేయండి. నా పిల్లలతో పాటే కలోగంజోతాగి బ్రతుకుతారు అని మా ఆవిడ చాలాసార్లు అడిగింది. వాళ్ళు పంపలేదు — సవితి పిల్లల్ని చూడలేక దూరంగా పంపేసిందని నలుగురూ అనుకుంటారుట. వాళ్ళు తన దగ్గరే వుండాలి, తనుపెట్టిన బాధలు పడాలి— ఆ తండ్రికూడ అంత చిత్రంగా ఎలా మారిపోగలిగాడో తలుచుకుంటేనే ఆశ్చర్యంగా వుంటుంది- అందుకే అన్నాను నీ పిల్లలు చాలా అదృష్టవంతులని.'

ఆలోచనలలో మునిగిపోయిన నిరంజనం మెల్లిగా తేరుకుని, 'పద ఇంటికి వెళ్దాం' అంటూ దారి తీయబోయాడు.

'ఇక్కడికి మా ఇల్లేదగ్గర. ఇవాళ నువ్వేరా,' అన్నాడు చలపతి.

ఇద్దరూ నడుస్తున్నారు. 'ఎలావుంది ఆఫీసు, ఉద్యోగం,' అని నిరంజనం అడిగినదానికి తన గోడంతా చెప్పుకొచ్చాడు చలపతి.

'నీకు తెలియందేముంది — మూడేళ్ళదాకా బదిలీలు రావని చెప్పటమేకాని మూడునెలలకే ట్రాన్స్‌ఫరు ఆర్డరు చేతిలో పెడతారు. అది పైవాడి దయాధర్మాలమీద క్రిందివాడి పలుకుబడిమీద ఆధారపడివుంటుంది—అంతేకాదు, ఎక్కడో వున్నవాడికి నేనుంటున్న వూరుమీద మక్కువ కలిగినా లేకపోతే మరో దిక్కుమాలిన చోట వున్నవాడు ఆ స్థలం విడిచి వచ్చేయాలనుకున్నా, ఏ పలుకుబడీ ఎవరి సిఫార్సులూ లేనివాళ్ళమే అధికారుల కళ్ళకి కనిపిస్తాము. ఎవరికి పుట్టిన బిడ్డరా వెక్కివెక్కి ఏడుస్తోంది అన్నట్లు నూగోడు పట్టించుకునే నాథుడేలేడు — ఈవూరు ఫరవాలేదు. పోయిన సంవత్సరం ఒ, ఏజెన్సీ ప్రాంతంలో పారేశారు. వచ్చిన జీతం అంతా మందులకీ డాక్టర్ల బిల్లులకే సరిపోయింది. సంవత్సరం మధ్యలో ట్రాన్స్‌ఫర్లతో పిల్లల చదువులు ఎందుకూ పనికిరాకుండా పోతున్నాయి— అదిగో ఆ ఎత్తు అరుగులదే నేనుంటున్న ఇల్లు. ఇల్లంతా కాదులే అందులో మూడుగదుల వాటాయే నాది'

మిగతా వాటాల పిల్లలతో కలిసి అరుగుల మీద ఆడుకుంటున్నవాళ్ళు కాస్త దూరంనుంచే తండ్రిని చూశారు.

'అమ్మా, నాన్నగారొచ్చారు.' అని అరుచుకుంటూ లోపలికిపోయింది ఏడేనిమిదేళ్లపిల్ల. అయిదేళ్ల పిల్లవాడు గబగబ మెట్లుదిగి తండ్రిదగ్గరికి రాబోయి






తండ్రి ప్రక్కనవున్న మరో కొత్త వ్యక్తిని చూసి అక్కడే ఆగిపోయాడు.

చలపతి నవ్వుతూ నాలుగడుగులువేసి వాడిని దగ్గరికి తీసుకుంటూ.

'మా మయ్యకి నమస్కారం చెయ్యి బాబూ' అని 'వీడు మా ఆఖరివాడు శశి మోహన్. వాళ్ళమ్మ ముద్దుగా శశి అని పిలుస్తుంది' అన్నాడు.

సిగ్గుపడుతూనే రెండు చేతులూ జోడించి నమస్కారం పెట్టినవాడి బుగ్గలు నిమిరి,

'ఆఖరివాడని అంత ధైర్యంగా చెప్పేస్తున్నావేం' అన్నాడు నిరంజనం నవ్వుతూ.

'సరేలే-నాకు నలుగురు పిల్లలు. అప్పటికయినా బుద్ధి తెచ్చుకుని జాగ్రత్త పడవద్దంటావా ?' మాట్లాడుతూనే మెట్లమీదినుంచి సావిట్లోకి వెళ్ళాడు.

'ఇతను నిరంజనం, నాలుగేళ్ళు కలిసి చదువుకున్నాం. అప్పట్లో ఎంతస్నేహంగా వుండేవాళ్ళమో? ఇద్దరం కలిసి ఎంత అల్లరిచేసేవాళ్ళమో తలుచుకుంటే ఇప్పుడుకూడ సరదాగానే వుంటుంది.' అంటూ భార్యకి పరిచయంచేసి గబగబ అతన్ని గురించిన మరికొన్ని వివరాలు కూడ చెప్పేశాడు.

పరికిణీ, ఓణీ వేసుకున్న పదమూడు పధ్నాలుగేళ్ళ పిల్లని చూపించి. 'ఇది మా పెద్దది, పేరు సరోజ, చిటికి మాటికి నాకు బదిలీ లవుతోంటే, తను కూడ మాస్టర్లనీ స్నేహితులనీ మార్చలేక స్కూలు మానేసింది. హాయిగా ఆంధ్రా మెట్రిక్‌కి కడతానంటోంది' అన్నాడు.

ఆపిల్ల తరువాత పదేళ్ళకొడుకు, ఏడేళ్ళకూతురు, వాళ్ళిద్దరూ స్కూలుకి వెళ్తున్నారు. ఇంట్లో అల్లరి భరించలేక శశినికూడ స్కూల్లో జేర్పిస్తే నాలుగురోజులలో ఆ మాస్టర్లూ పిల్లలూ హడిలిపోయి 'మీ అబ్బాయి అల్లరి మీరే భరించలేకపోతే మేం భరించగలమా' అంటూ ఇంటికి పంపేశారు—పోన్లే వెధవ స్కూలు. అల్లరి మానేశాకనే చదువుకుంటాను, అంటూ వాడూ పలక ఓమూలాకి విసిరేశాడు.

(ఇంకా ఉంది)





# ధర్మపథం

బులుసు వెంకటరమణయ్య

తనకేదైనా ఆపద కలిగే పక్షంలో, ఆ ఆపదనుంచి తప్పించుకొనుటకు సర్వవిధాలా ప్రయత్నించడం మానవుడికి సహజం. ఆపదను తప్పించుకోగలిగితే — తన శక్తిసామర్థ్యాలవల్లనే అలా జరిగినట్లు భావించడం కూడా సహజమే!

ఏ కార్యమైనా భగవదిచ్ఛాధీనమే అనీ, మానవుని ప్రయత్నమనేది నిమిత్తమాత్రమే అనీ గ్రహించగలిగినవారు చాలా అరుదు.

సుఖదుఃఖాలకూ, సంపద్విపత్తులకూ— సర్వానికీ భగవంతుని విలాసమే కారణమని భక్తులు మాత్రమే గ్రహించగలరు.

కష్టాలు వచ్చేటప్పుడు వాటిని అనుభవించడానికే సిద్ధపడతారుగాని, తప్పించుకోడానికి ప్రయత్నం చెయ్యరు. ఆ భగవంతుడే చూచుకొంటాడనే ధీమాతో.

తులసీదాసు మహాభక్తుడు. ఆయన హనుమంతుడి అనుగ్రహంవల్ల శ్రీరామచంద్రుడి దర్శనభాగ్యం పొందిన ధన్యజీవి. ఆయన 'రామచరితమానస' అనే పేరుతో రామాయణాన్ని హిందీలో గేయరూపంగా రచించి సాటిలేని కీర్తిని సంపాదించాడు. ఆ గ్రంథం ఉత్తరదేశం అంతటా ఆయన కాలంలోనే బహుళప్రచారం పొందింది.

కాశీలో అసీ సమీపంలో వున్న ఆయన ఆశ్రమం సదా భక్తుల భజనలతో భగవంతుణ్ణి కళ్లకు కట్టిస్తూవుండేది కూడా.

తులసీదాసు తొలుత అక్బరు చక్రవర్తి ఆత్మీయుల్లో ముఖ్యుడు. సంసారాన్ని పరిత్యజించేవరకూ తరుచు అక్బరుతోనే వుండేవాడట!

తులసీదాసు కీర్తిప్రతిష్ఠలు, మహత్తూ అక్బరు చెవిని పడ్డాయి. ఏమి తలచుకున్నా అతడు చెయ్యగలడనే వదంతి దేశమంతటా ప్రాకిపోవడంతో అక్బరుదృష్టి అతనివైపు మళ్లింది.

చక్రవర్తి భక్తశిఖామణిని సగౌరవంగా ఢిల్లీకి పిలిపించాడు. చక్రవర్తి అనుగ్రహం సంపాదించాలనే అపేక్ష తులసీదాసుకు లేదు. అయినా చిరపరిచితుడైన అక్బరు చక్రవర్తి మనస్సును కించపరచకుండా ఆయన ఢిల్లీకి వెళ్లాడు.

అక్బరు తులసీదాసును మిక్కిలి గౌరవించాడు.

అతడు 'స్వామీ! నీవు శ్రీరాముని దర్శించావట! అద్భుతమైన శక్తి ఉన్నదట నీకు. నాయందు దయవుంచి, శ్రీరాముని దర్శనం నాకు లభించేటట్లు చెయ్యి' అన్నాడు.

'భగవంతుడు తానుగా అనుగ్రహించి ప్రత్యక్షం కావాలిగాని యితరులు ఆయనను నిర్బంధించలేరు. శ్రీరాముని దర్శనం లభించాలంటే ఆయనపైని అపారమైన భక్తి వుండాలి; అంతేగాని ఇతరులవల్ల అది జరిగే కార్యం కాదు' అని తులసీదాసు సమాధానమిచ్చాడు.

'నీవు తలుచుకుంటే తప్పకుండా ఆయన దర్శనం చేయించగలవు. అటువంటి శక్తి నీకు ఉన్నది. నాకు శ్రీరామదర్శనం కావలసినదే! అంతవరకూ నువ్వు యిక్కడనుంచి కదలలేవు' అని అక్బరు కోపంతో అన్నాడు.

వెంటనే తులసీదాసు నిర్బంధించబడ్డాడు.

తాను కారాగార శిక్షను అనుభవిస్తున్నా తులసీదాసు ఏమీ విచారించలేదు. ఎక్కడ వున్నప్పటికీ రామనామస్మరణమే అతని లక్ష్యం.

కొద్దిరోజులే గడచాయి.

ఒకనాడు ఉన్నపాటుగా కోతులమూక ఢిల్లీ పట్టణంపైని పడి మహాభీభత్సం చేశాయి. ఇళ్ల కప్పులు విప్పివేసి, చెట్లను విరిచి, కనబడినవాళ్లను కరుస్తూ, రక్కుతూ జనానికి భీతావహం కలిగించాయి. ప్రజలు గగ్గోలు పెడుతూ చక్రవర్తితో మొరపెట్టుకున్నారు.

చక్రవర్తి విషయం గ్రహించాడు;

తులసీదాసు దగ్గరికివెళ్లి 'మహాత్మా! ఏమిటిది? ఇదంతా మీ ప్రభావమేనా?' అని ప్రశ్నించాడు.

తులసీదాసు నవ్వుతూ 'నువ్వు శ్రీరాముని దర్శనాన్ని కోరావు. ఆయన బంటులు వానరులు. రాముడు సైన్యాన్ని ముందు పంపాడు. తర్వాత ఆయన రావచ్చునేమో!' అన్నాడు.

తన అపరాధాన్ని క్షమించాలని అక్బరు తులసీదాసుకు నమస్కరించి ప్రాధేయపడ్డాడు. ఈ బాధను తప్పించాలని మరీ మరీ కోరాడు.

ఆ వానరసైన్యమంతా మటుమాయమైంది ఒక్కసారిగా. చక్రవర్తికి ఆనందం, ఆశ్చర్యం కలిగాయి.

భక్తుడు ఆత్మరక్షణకు యత్నించ నక్కరలేదు. అతనికి భగవంతుడే రక్షకుడు అవుతాడు.






ఒకప్పుడు ప్రకంపనుడనే వస్తాదు రాజుసభలోనికివచ్చాడు. అతడు సభలో యీవిధంగా సవాలుచేశాడు "దక్షిణ దేశాల్లోఉన్న వస్తాదులనందర్నీ ఓడించి వచ్చాను. మీ రాజ్యంలో యెవరైనా సరే నాతో కుస్తీపట్టవచ్చును, లేదా యిక్కడ వస్తాదులందరూ ఓడపోయి నట్లుగా నాకు విజయపత్రాన్ని యివ్వాలి."

అక్కడఉన్న వస్తాదులందరూ ప్రకంపనుడి బలాన్నిగురించి కథలను విని ఉన్నారు కాబట్టి అతనితో కుస్తీ పట్టడానికి యెవరూ సాహసించలేదు. అందుచేత రాజు ప్రకంపనుడికి విజయ పత్రాన్ని యివ్వవలసిన పరిస్థితి యేర్పడింది. అప్పుడు యేమి చేయాలన్నట్లుగా రాజు మల్లన్నమంత్రి వైపు చూశాడు వెంటనే మల్లన్నమంత్రి లేచి యిలాగ అన్నాడు.

'ప్రభూ! మనదేశంలోని ఉత్తర ప్రాంతపు అడవుల్లో భూకంపనుడనే వస్తాదు ఉన్నాడు. అతను నడిచినప్పుడు భూమి కంపిస్తుంది కాబట్టి అతనికి ఆపేరువచ్చింది. నేను యీ మధ్యను వేటకు వెళ్ళినప్పుడు అతన్ని చూశాను. తనతో కుస్తీపట్టే వస్తాదులు దొరకనందువలన అతను అడవి యేనుగులతో ఆడుకొంటున్నాడు. అతనికి నేను కబురు పంపిస్తాను. అతను వచ్చేవరకు ప్రకంపనుడు ఆంజనేయ స్వామి గుడికి దక్షిణంగా ఉన్న భవనంలో ఉండవచ్చును.'

'అలాగే'నని ప్రకంపనుడు ఆంజనేయస్వామి గుడికి దక్షిణాంగాఉన్న భవనంలో మకాంచేశాడు' ప్రకంపనుడు రోజూ ఆంజనేయస్వామి గుడికి వెడుతుండేవాడు. మూడురోజుల తరువాత ప్రకంపనుడు ఆంజనేయస్వామి గుడికి వెళ్ళేసరికి అక్కడకు యెవరో వచ్చినట్లుగా పెద్దపెద్ద అడుగులు కన్పించాయి. అక్కడ నేల గట్టిగా ఉన్నా కూడా ఆ అడుగులు భూమిలో సుమారు అరంగుళం లోతు దిగి ఉన్నాయి. 'ఆఅడుగులుయెవరివని ప్రకంపనుడు అక్కడఉన్న పూజారిని అడిగాడు. 'అవి భూకంపనుడి అడుగులు'ని పూజారి ప్రకంపనుడికి సమాధానం యిచ్చాడు. ఆమాట వినగానే ప్రకంపనుడికి కొంచెం భయం కలిగింది. భూకంపనుడు ఆ మర్నాడు ప్రకంపనుడితో కుస్తీపట్టడానికిసిద్ధంగా ఉన్నాడని మల్లనమంత్రి ప్రకంపనుడికి కబురు పంపించాడు.

పగలంతా రాజభటులు ఆంజనేయ స్వామి గుడికి ఉత్తరంగాఉన్న భవనంలోనికి గంపలతో పళ్ళు, కడవలతో పాలు పట్టుకొని వెళ్ళారు. ప్రకంపనుడు వాటిని చూసి, 'అవి యెవరికోసమ'ని రాజభటులను ప్రశ్నించాడు. అవి అన్నీ భూకంపనుడి కోసమేనని రాజ భటులు సమాధానం యిచ్చారు. ఆ మాటలు వినగానే ప్రకంపనుడికి చాలా భయం కలిగింది. ముందుగానే ఒకసారి భూకంపనుణ్ణి చూడడం మంచిదని ప్రకంపనుడు అనుకొన్నాడు.

భూకంపనుడు మకాంచేసి ఉన్న భవనం దగ్గరకు, ప్రకంపనుడు రహస్యంగా అర్ధరాత్రి వెళ్ళాడు. అక్కడ ఉన్న ఒక రాజభటుడి'కి లంచంయివ్వగా ఆ రాజభటుడు ఒక కిటికీ కన్నంలో నుంచి ప్రకంపనుడికి భూకంపనుణ్ణి చూపించాడు. భూకంపనుడు సుమారు పది అడుగుల పొడవు దానికి తగినంత లావు ఉన్నట్లుగా ప్రకంపనుడికి కన్పించాడు. దీనితో ప్రకంపనుడికి వణకు పుట్టింది. భూకంపనుడితో కుస్తీ పట్టడం ఆత్మహత్య చేసికోవడంవంటిదేననుకొని ప్రకంపనుడు యెవరికీ తెలియకుండా అర్ధరాత్రే పారిపోయాడు.

'భూకంపనుడు, ప్రకంపనుడు' యెక్కడ ఉన్నారని రాజు మర్నాడు అడగ్గా మల్లన్నమంత్రి యీవిధంగా సమాధానం యిచ్చాడు.

'ప్రభూ! అసలు భూకంపనుడనే వ్యక్తి యెవరూలేరు. అడుగుల ఆకారంలో యినుపదిమ్మలు తయారు చేయించి ఆంజనేయస్వామి గుడివద్ద వాటి జాడలుపడేటట్లు చేయించాను. ప్రకంపనుడు వాటిని చూసి భయపడ్డాడు. మనభటుల్లో లావుగా ఉన్న సుబ్బయ్యను అక్కడ ఉన్న భవనంలో ఉంచాను. నేను ఊహించినట్లుగానే ప్రకంపనుడు అర్ధరాత్రి భూకంపనుణ్ణి చూడడానికి ప్రయత్నించాడు. ప్రత్యేకంగా మనం అక్కడ నియమించిన భటుడు వెంకయ్య కిటికీ కన్నంలో నుంచి ప్రకంపనుడికి లోపలనున్న సుబ్బయ్యను చూపించాడు. చిన్న వస్తువునైనా పెద్దదిగా చూపించే అద్దాన్ని ఆకిటికీ కన్నానికి యెదురుగా ఉంచేను. అందులో అయిదడుగుల పొడవు ఉన్న సుబ్బయ్య పది అడుగుల పొడవు ఉన్నట్లుగా కన్పించాడు. అక్కడ ఉన్న దీపం మసకగా ఉండడంవలన ప్రకంపనుడు లోపల మరొక వస్తువును చూడలేకపోయాడు. ప్రకంపనుడు ఆ దృశ్యాన్ని చూసి, భయపడి పారిపోయాడు.'

ఆ సమాధానం విని రాజు మల్లన్న మంత్రి ఉపాయాన్ని యెంతగానో మెచ్చుకొన్నాడు.



# కప్పగంతుల మల్లికార్జునరావు

సూర్యారావుకు తాను చేసిన పనిని తల్చుకుంటే యీనాటికీ సిగ్గువేస్తుంది. తన తెగువకు, ధైర్యానికి ఆశ్చర్యం కలుగుతుంది కూడా!

అంత సిగ్గుపడే పనిచేసే సమయానికి సూర్యారావుకు యాభైఏళ్లు దాటేయి. వో గవర్నమెంటు ఆఫీసులో 'ఎస్టాబ్లిష్మెంటు' శెక్షనుకు సూపరింటెంటు.

ఉన్నట్లుండి ఆయన కోరోజు తమాషా అయిన ఆలోచన వచ్చింది...నైట్ కాలేజీలలో అంతా చదువుతున్నారు. తన చేతులోంచే ఆఫీసులో వాళ్లకి అందుగ్గాను పర్మిషన్ యిచ్చాడు. ఎందరికో 'లీవు' శేంక్షను చేశాడు. అంతా తన కళ్లముందే బి. ఎ. చదివి డిగ్రీలు తెచ్చుకొన్నారు. తాను మాత్రం ఎందుకు పి. యు. సి. లో చేరకూడదు? నాలుగు సంవత్సరాలు కష్టపడితే తనూ బి. ఎ. పాసు కావచ్చు.

ఈ ఆలోచన రావటమే తడవుగా, ముందువెనుక లాలోచించకుండా, తాను పి. యు. సి. చేరదల్చుకొంటున్నట్లు అందుగ్గాను తగు అనుమతి నివ్వవల్సిందిగా కోరుతూ కాగితాన్ని వ్రాసి ఆఫీసరు కిచ్చాడు. ఆ కాగితంమీద ఆఫీసరుగారి పొట్టిసంతకం పడి, తిరిగి సూర్యారావు శెక్షనుకేవచ్చి, ఆయన క్రిందే పనిచేసే వో గుమాస్తా చేతుల్లోంకిపోయి, రిజిస్టరులోకెక్కి భద్రంగా ఫైలులో దూరింది.

కాగితం వ్రాసిన అయిదు నిముషాల్లోనే ఆఫీసంతా యీ విషయం 'గుప్పు'మంది. అంతా వచ్చి—'కంగ్రాచ్యులేషన్స్ — బెస్టు విషెస్'లు చెప్తుంటే సూర్యారావుకు సిగ్గుతో చచ్చినచావు అయింది.

ఆ రాత్రి భోజనాలప్పుడు యీ వార్తను నెమ్మదిగా యింట్లో వాళ్ల చెవుల్లో వేశాడు. 'యిన్నేళ్లొచ్చి యిప్పుడు చదువేమిటమ్మా చిత్రం! ఏదో సామెత చెపుతార్లే—'అంటూ ఆ సామెత చెప్పకుండానే గడ్డంక్రింద చేతులేసుకొని ఆశ్చర్యపోయింది ఆయన భార్య దుర్గాంబ. రెండో కాన్పుకు పురుటికివచ్చిన మూడో కూతురు రుక్మిణి ముసిముసిగా నవ్వుకొంది. ముగ్గురు ఆడపిల్లల తర్వాత కలిగిన కొడుకు కృష్ణారావు తండ్రి మాటలు విని సిగ్గుపడుతూ నవ్వుకొన్నాడు. అతనూ యస్సెల్సీ పాసై పి. యు. సి. లోకి వచ్చాడు అదే సంవత్సరం. తనూ తండ్రీ వొకే క్లాసు!

రెండు రోజుల తర్వాత 'యీ అప్లికేషన్ ఫారంమీద సంతకం పెట్టు నాన్నా'అంటూ వచ్చాడు కృష్ణారావు. కొడుకును కాలేజీలో చేర్చుకొన్నపక్షంలో జీతం అవీ తను కట్టాలన్న 'సర్టిఫికెట్' అది. సంతకం పెట్టియిస్తూ 'నాకూ వో అప్లికేషన్ తీసుకు రాకపోయావ్రా ఆ చేత్తోనే' అన్నాడు

సూర్యారావు సిగ్గుపడ్డాడు. 'అలాగే నాన్నా సాయంత్రం తీసుకొస్తాను—' అంటూ వెళ్ళాడు కృష్ణారావు.

పర్మిషన్ కాగితం ఎట్టకేలకు గుమాస్తా బల్ల వదిలింది. తన విషయమే కనుక సూపరింటెండెంట్ సూర్యారావు బల్లను చూడకుండా, ఆ కాగితం నేరుగా చిన్న ఆఫీసరు వద్దకు వెళ్ళింది. అక్కడినుంచి పైకి కదలటానికి రెండు రోజులు పట్టింది. యీ రెండు రోజుల్లో అయిదుసార్లు అడిగాడు ఆఫీసరుని—'యిదిగో. యిప్పుడే చూచి పంపిస్తా' అంటూనే రెండు రోజులు తీసుకొన్నాడు. మొత్తానికి పొట్టి వొట్టిసంతకంతో పై ఆఫీసరుకు వెళ్ళింది ఫైలు. పర్మిషన్ యివ్వవచ్చు అన్నముక్క ఎవ్వరూ వ్రాయలేదు. గుమాస్తాకు అలా వ్రాసే అలవాటులేదు. యింకోరి విషయమైతే సూర్యారావు వ్రాసేవాడు. తన విషయం కనుక ఆయన చేసేదేమీ లేకపోయింది. పై ఆఫీసరు ఫైలును తన బల్లమీద అయిదు రోజులు అట్టే పెట్టుకొని కొన్ని 'క్వెరీ'లువేసి వెనక్కి పంపించాడు. ఆ ఫైలు తిరుగు ప్రయాణానికి మరో రెండురోజులు తీసుకొని, గుమాస్తా బల్లమీదికి చేరి కన్నుమూసింది.

'రెడ్ టేప్' అన్న పదాన్ని సూర్యారావు చాలాసార్లు విన్నాడు. అయితే అతనికా రెడ్ టేప్ అంటే అసహ్యం. తన బల్లమీద ఫైలువుంటే చిరాకు. ఆ రెడ్ టేప్ మహిమ అందరు చెప్పుకోగా విన్నాడు కూడా. అయితే దాని మహిమ ఎటువంటిదో, యివాళ తన ఫైలు విషయంలో ప్రత్యక్షంగా తెల్సుకొన్నాడు.

సూర్యారావు అప్లికేషన్ఫారం పూర్తి చేశాడు, పూర్తిచేస్తూ సంతోషించాడు. చిన్నతనాన్ని తల్చుకొని విచారించాడు. అవసరమైన డబ్బును చలాను రూపంలో, బ్యాంకులో 'క్యూ'లో నిలబడి కట్టేడు. దరఖాస్తులు యివ్వాల్సిన గడువు యింకా రెండు రోజులేవుంది. అప్లికేషన్తోపాటు పర్మిషన్ కూడా జతపర్చాలి. కానీ అది యిస్తేగా ఆఫీసువాళ్ళు? ఆఫీసు ధోరణి ఆయనకు చిరాకును కలుగచేసింది.

ఇతరుల పనులకైతే తమను తొందర పెడ్తారు. 'అర్జంటు' 'టుడే' అన్న పదాలతో తన ప్రాణాలు తీస్తారు. ఆలస్యమైతే చీవాట్లు. కాని అదే తన పనసేసరికి అంతా ఆలస్యమే. అన్నీ క్వెరీలే! యింతమందికి పర్మిషన్లు యిచ్చాడు తన చేతులమీదుగా. ఒక్క ఫైలుమీద క్వెరీ పడలేదు. తను వ్రాసిందానికి 'యస్' అంటూ మరునిముషంలో వచ్చేది ఫైలు.

రేపు గడువనగా, యివాళ్టిరోజు గుర్తు చెయ్యగా గుర్తుచెయ్యగా, క్వెరీకి జవాబులతో ఫైలు తిరిగి ఆఫీసరుదగ్గరికి వెళ్ళింది. ఆ క్వెరీ లేమిటో సూర్యారావుకు తెలియదు. గుమాస్తా తనకుగాను తాను చెప్పలేదు. కాన్ఫిడెన్షియల్ ఆయిరి మరి! చెప్పని గుమాస్తా నడగటం చిన్నతనమనిపించింది సూర్యారావుకు. చిన్నఆఫీసరు సరేసరి! యీ విషయ మెత్తితేనే మొహం తప్పిస్తున్నాడు. పెద్ద ఆఫీసరుతో మాట్లాడొచ్చాకకాని ఆయనకి అసలు విషయం బోధపడలేదు.

సూర్యారావు ఆఫీసులోకల్లా అనుభజ్ఞుడైన సూపరింటెండెంటు. ఎస్టాబ్లిష్మెంటు శెక్షనులో ఎన్నోఏళ్ళుగా పనిచేస్తున్నాడు. జీవికి ఆహారంలాగా, ఆఫీసుకు ఎస్టాబ్లిష్మెంటు శెక్షను ముఖ్యమైనది. అక్కడ పనిచేసే సూపరింటెండెంటుకు, గుమాస్తాలకు అందరికంటె విలువ జాస్తిగా వుంటుంది. దానికి తగ్గట్టుగా వాళ్ళూ కళ్ళు నెత్తిన పెట్టుకొనే దర్జాలు వెలగబోస్తుంటారు. పనున్నా లేకపోయిన రాత్రిళ్ళు కూడా పని చేస్తున్నట్లు నటిస్తుంటారు. ఎస్టాబ్లిష్మెంటులో పని చేయటానికి యిదో క్వాలిఫికేషన్ కూడా!

అయితే సూర్యారావు యిన్నేళ్ళబట్టి ఎస్టాబ్లిష్మెంటులో పనిచేస్తున్నా ఎప్పుడూ గర్వాన్ని ప్రదర్శించలేదు. ఎవరి లీవు కాగితాలనూ కావాలని టేబిల్పైన తొక్కిపెట్టలేదు. సాధారణంగా ఎస్టాబ్లిష్మెంటు వాళ్ళు మనుష్యులకు ఏదో మేలు చేస్తున్నట్లు కన్పించటానికి ఆలస్యంచేసి పదిసార్లు తిప్పించుకొని తర్వాత పనిచేస్తారు, సూర్యారావు అలా ఎవర్నీ తిప్పించుకొనేవాడు కాదు. రాత్రిళ్ళుకూడా కూర్చొని ఏ రోజు కాగితాలను ఆ రోజు 'డిస్పోజ్' చేసేవాడు. అయితే తను కూర్చున్నాడు కనుక గుమాస్తాలను కూర్చోమనటం ఆయన అలవాటు కాదు. వాళ్ళ పనులైతే వాళ్ళని వెళ్ళమని తనే చెప్పేవాడు. అందుకే సూర్యారావు అంటే అందరికీ చులకన. మంచితనానికి యీ రోజుల్లో యిచ్చే మన్నన అదే మరి!

అటువంటి గంగిగోవులాంటి సూర్యారావు నైట్ కాలేజీలో చేరేత్త ఆ శెక్షను చూచేదెవరు? వర్కు సఫర్ కాదూ? రెండోది— సూర్యారావుకు ఏభైఏళ్ళు దాటాయి. యిప్పుడు పి. యు. సి. మొదలుపెట్టి, అన్నిక్లాసులు తప్పకుండా పాసయితే యాభైనాలుగేళ్ళు దాటి రిటైరు కాబోయేముందు బి. ఎ. అవుతుందన్నమాట! దానివల్ల ఆయనకేం లాభం? లాభంలేని చదువు చదవకపోతే నష్టమేమిటి?......ఆఫీసరుగారి క్వెరీల సారాంశం యిది. ఏతావతా తేలిందేమిటంటే— ఆఫీసర్లకు సూర్యారావు చదవటం, అందుగ్గాను అనుమతి నివ్వటం యిష్టంలేదు.

ఆఫీసరుగారి ఆలోచన సూర్యారావుకు ఆశ్చర్యాన్ని కలుగచేసింది, బాధను కలుగచేసింది! నిజానికా సందేహాలకు తాను జవాబివ్వాలి. కాని తన నడగలేదు. గుమాస్తా ఆఫీసరుగారి ప్రశ్నలకు ఏం సమాధానం వ్రాశాడో, చిన్నఆఫీసరుగారు ఏం వ్రాశాడో— అసలు తనకు సంబంధించిన ఆ ప్రశ్నలకు వాళ్ళెలా సమాధానాలు వ్రాయగలుగుతున్నారో బోధపడలేదు ఆయనకి.

పని కావాలంటే వాదిస్తే లాభంలేదు, అందర్నీ బతిమలాడుకోవాలి. అవసరమైతే కాళ్ళు పట్టుకోవాలి, కన్నీళ్ళు కార్చాలి.

చివరి కెలాగైతేనేం సూర్యారావుకు పర్మిషన్ యిచ్చారు.

ఆ సాయంకాలం అప్లికేషన్ కాలేజీలో యివ్వాలనుకొని అన్నీ సిద్ధం చేసుకొని భోజనం ముగించుకొని ఆఫీసుకెళ్తుంటే కృష్ణారావు వచ్చాడు. 'నాన్నా యస్సెల్సీలో నీ పర్సెంటేజి ఎంత?' అంటూ.

'ఎందుకురా?' అన్నాడు సూర్యారావు.

'యీతడవ నైట్కాలేజీకూడా చాలా అప్లికేషన్లు వచ్చాయిట. నలభైఅయిదు పర్సెంటేజీ వచ్చిన వాళ్ళకూడా సీటు రావటం కష్టం అనుకొంటున్నారు—'

సూర్యారావు హతాశుడయ్యాడు. యస్సెల్సీలో అతని పర్సెంటేజి సరిగ్గా ముప్ఫైఅయిదు. అన్ని సబ్జెక్ట్సులో బొటాబొటీగ మార్కులొచ్చాయి. తండ్రి మొహం చూస్తూనే ఆయన మార్కులను వూహించగలిగిన కృష్ణారావు మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

సూర్యారావు కాళ్ళీడ్చుకొంటూ బస్సు స్టాపువైపు నడిచాడు.

* * *

కదల్లోలాగా, కొందరికి చీటికి మాటికీ గత చరిత్ర జ్ఞాపకం వస్తుంటుంది. అయితే సూర్యారావు గతాన్నిగురించి ఆలో

వించి బాధపడే అలవాటును ఎప్పుడో మానుకొన్నాడు. అయినా యివాళ, తనకి సీటు చిక్కదేమో అన్న అనుమానం కలిగాక, చేతులారా నాశనం చేసుకొన్న చిన్ననాటి జీవితాన్ని పునశ్చరణం చేసుకో లేకుండా వుండలేకపోయాడాయన.

సూర్యారావు తండ్రి వృత్తి వైదీకం. సంపాదన బాగానే వుండేది. బాగా కాస్త కూస్త ఆస్తీ వుంది. కొడుకును బాగా చదివించి, పెద్ద ఆఫీసరుగానో, జడ్జిగానో చెయ్యాలని ఆయన కోరిక. తల్లి కోరిక కొడుకు కలెక్టరు కావాలని. చిన్నతనంలో సూర్యారావు నెవరైనా తమాషాకు 'నువ్వు కలెక్టరు అవుతావా, జడ్జివౌతావా' అని అడిగితే; 'ఏరేమో నేను హరికథలు చెప్తానూ, పిడేలు వాయిస్తాను—' అనే వాడు సూర్యారావు. ఊళ్ళో జరిగే దేవీ నవరాత్రులప్పుడు, వినాయకచవితికి, చెప్పే హరికథలు విని విని, తానూ అలా హరికథలు చెప్పాలని వువ్విళ్ళూరేవాడు.

వయస్సు పెరిగేకొద్దీ, సూర్యారావులో కలెక్టరు, జడ్జీలయ్యే సూచనలు కాని, కనీసం హరికథలు చెప్పే చిహ్నాలు కాని ఏమీ కనపడలేదు. ఎప్పుడూ బదుద్ధాయిలా తిరుగుతుండేవాడు. ఏటవతల యిసుకలో కుస్తీలు పట్టటం, చెడుగుడు ఆడటం, ఈతలు కొట్టటం బాగా నేర్చుకొన్నాడు.

తండ్రి వాళ్ళ కాళ్ళ వీళ్ళ కాళ్ళ పట్టుకొని థర్డుఫారం పాసు చేయించుకొన్నాడు సూర్యారావుని. మిడిల్‌స్కూలు అయి హైస్కూలుకొచ్చేసరికి సూర్యారావు గర్వం బారెడు పెరిగింది. తను చదవకుండానే పాసు కాగలనన్న ధీమా కలిగింది.

ఫోర్తుఫారంలో రవుడీల సహవాసం అబ్బింది. మేస్టర్లను ఎదిరించటం, ఆడపిల్లల్ని ఏడిపించటంలాంటి పనులు చేయటం హుషారుగా వుండేదతనికి. ఫలితంగా ఫోర్తుఫారం ఫెయిలయ్యాడు. అయినా అతని పద్ధతి మారలేదు. తలిదండ్రులు చదవమని చెప్పేవారే కాని, ఏం చదువుతున్నది, ఎలా చదువుతున్నది కనిపెట్టటానికి వారికీ యింగ్లీషు చదువులు రావు. డిటెక్టివ్ నవలలు చదివినా తల్లి క్లాసు పుస్తకమే అనుకొనేది. తండ్రి అమరకోశమూ, శబ్దమంజరి,

# చదువు

వల్లె చెప్పి మాటి మాటికి వాటిని చెప్పించుకొంటూ, కొడుకు తెలివితేటలు చూచుకొని సంబరపడుతుండేవాడు.

ఫోర్తుఫారం రెండో సంవత్సరం కూడా ఫెయిలయ్యాక కాని ఆయనికి కొడుకు తెలివితేటలమీద అనుమానం కలుగలేదు. అప్పుడు వెళ్ళి హెడ్‌మాస్టరును కలుసుకొన్నాడు.

'మీవాడేం—లాభం లేదండి. చదువు మాన్పించి, వైదీకం నేర్పండి. బాగుపడతాడు—' అన్నాడు హెడ్‌మాస్టరు.

'ఏదో చిన్నవాడు. మీరు దయతలిస్తే 'మిటిక్లేషన్' దాకానన్నా చెప్పిద్దామని వుంది—' అన్నాడు సూర్యారావు తండ్రి.

హెడ్‌మాస్టరు సూర్యారావు వ్రాసిన లెక్కల పేపరు, సైన్సు పేపరు తీసుకొచ్చి ఆయనకు చూపించాడు. అర్ధపేజీ కూడా వ్రాసి లేదు. వొకదాంట్లో రెండు మార్కులు, రెండోదాంట్లో సున్నా వచ్చింది. 'యిక చెప్పండి. నన్నేం దయ తలవమంటారో—' అన్నాడు హెడ్‌మాస్టరు.

మరుసటి సంవత్సరం సూర్యారావు తండ్రి, కొడుకును కాస్త కనిపెట్టి వుండి కట్టుదిట్టంలో వుంచాడు. తను రెండోమారు కూడా ఫెయిలయినందుకు సూర్యారావుకు బాధ కలిగింది. తను ఫెయిలయినందుక్కలిగిన బాధ కాదది. తనతోటి వాళ్ళంతా పైక్లాసులకెళ్ళారే అన్న దిగులు అది.

ఫోర్తుఫారం పాసయ్యాడు సూర్యారావు. ఆటలు, కుస్తీలు తగ్గాయి. వాటి స్థానంలో మరో కొత్తపిచ్చి పట్టుకొంది. క్లాసుపుస్తకం మినహాయించి మిగతా ఏ పుస్తకం కన్పించినా చదివేసేవాడు. నవలలు—కథలు—నాటకాలు—వొకటేమిటి ...యస్సెల్సీ పరీక్షలకెళ్ళేనాటికి ఎన్ని పుస్తకాలు చదివేడో లెక్కేలేదు. రేపు యస్సెల్సీ పరీక్షనగా యివాళ 'శేష ప్రశ్న' నవల దొరికింది. ఆ రాత్రికి రాత్రి కెష్టలేంపు వెలుగులో తెల్లవార్లు చదివి పూర్తిచేశాడు దాన్ని.

యస్సెల్సీ పరీక్షా మిత్రులందరితో పాటు ఫెయిలయ్యాడు సూర్యారావుకూడా.

ఆ ప్రొద్దున్న ఫలితాలు పేపర్లో చూసుకొని, అంతా కల్సి హుషారుగా హోటల్లో టిఫిన్‌తిని, చెరువుగట్టున పార్కుకెళ్ళి పిట్లపేక లాడుకొన్నారు!

మిత్రులంతా 'ట్యుటోరియల్ కాలేజీ'లో చేరేరు. తండ్రి సూర్యారావును కూడా చేరమన్నాడు. 'ఆ- నేను పాసుకా దల్చుకొంటే కాలేనా? అన్నాడు సూర్యారావు.

అక్టోబరులో అంతా పాసయ్యారు కాని, సూర్యారావు మాత్రం ఫెయిలయ్యాడు. ఆరోజు మిత్రులంతా కల్సి హుషారుగా చేరబోయే కాలేజీ కబుర్లు చెప్పుకొంటూ సినిమాలకివెళితే, సూర్యారావు మాత్రం తాను వొంటరివాడయినట్లు, తను తప్పుచేసినట్లు బాధపడ్డాడు.

కొడుకు మళ్ళీ ఫెయిలయినట్లు తెలుసుకొన్న క్షణంలో తండ్రి మొహం చూశాడు సూర్యారావు. ఆయన మొహంలో బాధ, నిరాశ, వేదన తాండవించాయి. అయినా అన్నిటినీ కప్పిపుచ్చుకొని ఫెయిలయినందుకు విచారిస్తున్న కొడుకుతో అన్నాడు— 'యిప్పుడు విచారించి ఏంలాభం? తరువాత కర్తవ్యం ఆలోచించు—'

సూర్యారావు ఆలోచించాడు తనూ పాసుకావాలి! అందరితోపాటు తానూ కాలేజీలో చేరాలి. తండ్రి బాధను పోగొట్టాలి. తనూ తెలివిగలవాడని నిరూపించాలి.

మార్చికి కట్టేడు. అన్నీ కొత్త పుస్తకాలు. అవీ లేవు. వ్యవధి మూడునెలలే వుంది. ఒకటిన్నర సంవత్సరం చదివినా పాసుకాలేనివాడు, మూడునెలల్లో ఏం పాసవుతాడనుకొన్నారంతా... సూర్యారావుకీ అదే అధైర్యం! కాని సరిగ్గా అదే సమయానికి రామ్మూర్తితో పరిచయం కలిగింది.

తండ్రికి ట్రాన్స్‌ఫర్ కావటంచేత రామ్మూర్తి ఆ సంవత్సరమే ఆ వూరికొచ్చి యస్సెల్సీలో చేరేడు. ఎర్రగా, బక్కపల్చగా వుండేవాడు. వయసులో సూర్యారావుకన్నా చాలా చిన్నవాడు.

రామ్మూర్తి సూర్యారావుకి ధైర్యం చెప్పేడు. తన పుస్తకాలిచ్చాడు. నోట్సులు యిచ్చాడు. స్టోరీలు వొప్పచెప్పించాడు.

లెక్కలు చెప్పేడు. తాను సంవత్సరమంతా బళ్లో నేర్చుకొన్నదాన్ని రెండునెలల్లో సూర్యారావుకు చెప్పేడు. రామ్మూర్తి పాఠంచెప్పి, హోంవర్కు యిచ్చి వెళ్లేవాడు పొద్దున్నే. సాయంత్రం వచ్చి అన్నీ ఒప్పచెప్పించుకొనేవాడు.

కష్టపడ్డ ఫలితం పూరికేపోలేదు. పరీక్ష పాసయ్యాడు సూర్యారావు. కానీ రామ్మూర్తిలా అరవైలు, డెబ్బయిలు మార్కులుతో కాదు అత్తెసరు మార్కుల తోటి.

రామ్మూర్తి సైన్సు 'సబ్జక్టు'తో చదవటానికి మరోవూరు మంచికాలేజీకి వెళ్లేడు. సూర్యారావు మళ్లీ తన పాత స్నేహితులతో కల్సి ఆ వూరి కాలేజీలోనే 'ఆర్ట్స్ సబ్జెక్టు'తో యింటర్‌లో చేరేడు.

కాలేజీ వాతావరణం కొత్తగా ఆకర్షణీయంగా కన్పించింది. పాతస్నేహితులంతా ఒకేచోట వుండటంతో పాత అలవాట్లు విజృంభించాయి తిరుగుళ్లు...రాజకీయాలు...ఎలక్షన్లు...నాటకాలు...రెండు సంవత్సరాలకాలం రెండు నిముషాల లాగా గడిచిపోయింది. పదిరోజుల్లో పరీక్షలైతే ఆరోజు నాటకం వేశాడు సూర్యారావు—గర్వంగా. ఫలితం మామూలే, ఇంటర్ ఫెయిలుకావటం.

ఇంకా కొడుక్కి చదువు చెప్పించటం తెలివితక్కువగా తోచింది తండ్రికి పైగా కోడలు వయసొచ్చి కాపురానికి రావటానికి సిద్ధంగా వుంది.

చదువు ఆపటం అవేసరికి సూర్యారావుకి బాధ కలిగింది. అంతరాంతరాలలో అతనికి డిగ్రీ అన్నా పుచ్చుకోవాలన్న కోరిక గాఢంగా వుంది. అయినా...కాపురానికి రానున్న భార్యా...చదువు చెప్పించనంటున్న తండ్రి...పరిస్థితులకు తల ఒగ్గేడు. బాధ్యతలు నెత్తినపడటంతో జీవితం మరోదిశకు మళ్లింది.

రామ్మూర్తి యమ్మెస్సీ పాసయ్యాడు. ఫారిన్ వెళ్లేడు. పెద్ద వుద్యోగం చేస్తున్నాడు. సూర్యారావు అనుక్షణం తనుచేసిన పొరపాటుకు మనసులోనే చింతిస్తూ వచ్చాడు.

చదువుకొనే రోజుల్లోలా కాకుండా, వుద్యోగంలో అతి జాగ్రత్తగా తన విధులను నిర్వహించటం నేర్చుకొన్నాడు. పై అధికారుల ఆలోచన కనుగుణంగా మెసలుకోవటం అలవర్చుకొన్నాడు. కష్టపడి 'రూల్సు' నన్నిటినీ క్షుణ్ణంగా చదువుకొన్నాడు.

అసలీ 'రూలు' అన్నది చాలా తమాషా అయినది. ఒక రూలును అందరూ ఒకే విధంగా అర్థం చేసుకొనే పద్ధతిలో నిర్మింపబడుతున్నట్లు తోచదు. ఒక్కో రూలుకు ఒందరకాల భాష్యాలు—అంటే 'యిన్‌టర్‌ప్రెటేషన్స్' చెప్పవచ్చు. ఒకే రూలుకు యింకో వంద 'అమెండ్‌మెంట్స్' అనగా సవరణలు వుంటాయి. ఒక వ్యక్తికి మేలు చేయదల్చుకొంటే, ఫలాని రూలుకు చెప్పే భాష్యం ఒక రకం—కీడు చేయదల్చుకొంటే, ఆ ఫలాని రూలుకు చెప్పే భాష్యం మరోరకం...అయితే తను భాష్యీకరించిన సిద్ధాంతాన్ని అందరిచేతా ఒప్పించటం కష్టం. సూర్యారావు ఆపని చేయగలడు.

సూర్యారావు ఆలోచిస్తూనే బస్సు స్టాప్‌కు నడిచి, క్యూలో నిల్చున్నాడు. బస్సు రావటంతో కాని ఆ ఆలోచన తెగలేదు.

తీర్పని మంత్రుల వాగ్దానాల్లా పొడుగ్గా వున్న 'క్యూ', బస్సు రాకతో, పంచవర్ష ప్రణాళిక ప్రగతిలా కొంచెం కదిలింది. అంతలోనే నెక్సల్ బరీ అతివాదుల్లా క్యూలో వాళ్లు బయటపడి విచ్చలవిడిగా బస్సుమీదికి దాడి చేశారు. డబ్బున్నవాళ్లు ఎలక్షన్లలో గెలిచినట్లుగా బలంవున్నవారు బస్సెక్కి వెళ్లిపోయారు. శనివారు, ఇజ్రాయల్‌చేతిలో దెబ్బతిన్న అరబ్బుల్లా, దిగాలుపడినిల్చుండిపోయారు!

ఆఫీసుకెళ్లే ఆలోచన మానుకొని, యింకో బస్సెక్కి తెల్సిన పెద్దమనిషింటికి వెళ్లేడు. ఆయనతో కూడా వెళ్లి ప్రిన్సిపాల్‌గారిని కల్సుకొన్నాడు. ఆయన చేతుల్ని, కాళ్లనుకోమని, వాటిని పట్టుకొని బ్రతిమలాడేడు. చివరి కెలాగైతే సూర్యారావుకు పి. యు. సి. లో సీటు దొరికింది.

* * *

మొట్టమొదటిసారిగా పి. యు. సి. క్లాసులోకి వెళ్తొంటే, సూర్యారావుకు మనసులో ఏదో చెప్పలేని అనుభూతి కల్గింది. ఆఫీసు వాతవరణంలోనుంచి కాలేజీ వాతావరణంలోకి వచ్చేసరికి, ఎండాకాలంలో విజయవాడనుంచి సిమ్లా వెళ్లినంత హాయికలిగింది. ఏదో స్వేచ్ఛ...స్వాతంత్ర్యం...వయసు మర్చిపోయాడో క్షణం, కుర్రవాడయ్యాడు! అయితే ఆ ఆనందం ఓ క్షణం మాత్రమే!

క్లాసులోకి అడుగు పెడ్తూనే, ఎదురుగ్గా కూర్చొనివున్న విద్యార్థులను చూచాడు. ఆయనకు సిగ్గువేసింది. వాళ్లల్లో చాలామంది వుద్యోగులే అయితే అంతా యిరవై, పాతికేళ్ల లోపువారే. యాభైఏళ్ల స్టూడెంటు సూర్యారావొక్కడే ఆ కాలేజీలో!

'రాండి మాస్టారూ...' అన్నాడో





అల్లుడూ–నువ్వు 1966 లో పండగకొచ్చినప్పుడు ఆడాబా లో వుండేవాళ్ళం– 1967 లో ఆపూరింట్లో వున్నాం– ఇప్పుడు......

# చదువు

యువకుడు సూర్యారావుకు స్వాగతం చెప్తున్న పోజులో.

క్లాసులోకి లెక్చరర్ వస్తుంటే అంతా లేచి నిలబడ్డారు. వచ్చిన యువకుణ్ణి చూచి లెక్చరర్ అనుకోలేదు సూర్యారావు. పేంటు...బుష్ షర్టు... పాతికసంవత్సరాల యువకుడు తన కొడుకు క్లాసు తప్పకుండా పాసైతే ఇలా ఇవాళ్టికి యిలాగే లెక్చరర్ అవుతాడనిపించింది. తన కొడుకు అనుకొన్నంత అభిమానం కలిగింది.

కృష్ణారావూ పి. యు. సి. వే. అయితే అతను 'డే' కాలేజీ. కాలేజీలో తెలివిగల విద్యార్థులకింద పరిగణింపబడే వాళ్లల్లో వొకడు.

సూర్యారావుకు ఏమైనా తెలీకపోతే కొడుకును అడుగుదామని మనసులో అనుకొనేవాడు. కానీ అదోరకమైన సిగ్గు... కొడుక్కు తను చెప్పటంపోయి — తను కొడుకు నడగమేమిటి? ఛీ...ఛీ...

'నాన్నగారూ ... యింగ్లీషులో యీ యస్సే' యింపార్టెంటు అనుకుంటు న్నారు.' అని చొరవతీసుకొని అప్పటికీ కొడుకుకే ఏదన్న చెప్పేవాడు. 'ఫలాని యీ కొశ్చెషన్ ఖాయంగా వస్తుంది నాన్నా...' అని కొడుకంటుంటే సూర్యారావుకు వొకవైపు సంతోషం — మరో వైపు సిగ్గు యింకోవైపు గర్వం!

పి. యు. సి. పరీక్షలు దగ్గరి కొచ్చాయి. అంతవరకూ క్లాసులుకు పోవటం తప్ప షుట్టిగా చదివిందిలేదు. కాలేజీన్నుంచి వచ్చేసరికి పది దాటేది. అప్పుడు స్నానంచేసి, భోజనం ముగించే సరికి—పగలంతా ఆఫీసులో, సాయంత్రం కాలేజీలో అలసిపోయిన ప్రాణం విశ్రాంతి కావాలని కళ్లు మూసుకొని నిద్ర పోయేది. వీలైతే పొద్దునపూట గంటో అరగంటో పుస్తకం తెరవటం...మళ్లీ తొమ్మిందింబావుకల్లా బస్సు—క్యూ... ఆఫీసు...!

పరీక్షలు నెలా పదిహేను రోజులున్న యనగా శెలవు పెట్టేడు సూర్యారావు. యిప్పుడు ఆయన ఎస్టాబ్లిష్మెంటు సెక్షనులో పని చెయ్యటంలేదు. పి. యు. పి. లో చేరటంతో ఆయన్ని ఆ పదవినుంచి చ్యుతుణ్ని చేసి మరో సెక్షనుకు పారేశారు. స్టేట్ మినిస్టర్‌కు కేబినెట్ హోదాగల మంత్రిపదవి నిచ్చినట్లుగా మరో సూపరింటెండెంటును ఆ సెక్షనులో వేశారు.

'చదువుకోటానికైతే శెలవు శాంక్షన్ చేయబడదు' అంటూ ఆర్డర్సు అతని కిచ్చారు. తన కాలంలో ఇలాంటి అడ్డంకు లేమీలేకుండా ఎందరికో శెలవు శాంక్షన్ చేశాడు. కానీ తీరా తనకు చదువుకోటానికి సెలవు కావాలంటే యిదీ తంతు. సూర్యారావుకి ఆఫీసుపైన జాలి కలిగింది!

నాలుగురోజు లాగి, తాను స్వంతపనులు చూచుకోటానికి అర్జెంటుగా వూరు వెళ్లాలి కనుక సెలవు కావాలని కోరుతూ మళ్లీ వో కాగితం పెట్టుకొన్నాడు. యీ మారు కాగితంతోపాటు 'ప్రైవసీ' కూడా చేశాడు. గుమాస్తాను, సూపరింటెండెంటును, చిన్న ఆఫీసర్ను, పెద్ద ఆఫీసర్ను అందర్నీ కల్సుకొని సలాములు— నమస్కారాలు పెట్టుకొన్నాడు. లీవు శాంక్షన్ అయింది యీమారు.

అనగా—అబద్ధం నిజాన్ని వోడించింది!

'ప్రైవసీ పద్ధతి, నిజాయతీ విధానాన్ని చూచి పరిహాసంగా నవ్వింది!!

వయసు పెరిగేకొద్దీ అనుభవం పెరుగుతుందన్నమాట వాస్తవమే కాని, వయస్సు వెనక్కు జారేకొద్దీ గ్రహణశక్తి, జ్ఞాపకశక్తి సన్నగిల్లుతుందనేమాట వాస్తవమే! చివరికి కొడుకు సహాయాన్ని అడక్క తప్పలేదు సూర్యారావుకి. తెలుగు, ఇంగ్లీషు బాగానే చెప్పేడు కృష్ణారావు తండ్రికి. అప్పుడప్పుడు చిన్ననాడు తనకు చదువు చెప్పిన రామ్మూర్తి జ్ఞాపకం వచ్చేవాడు కృష్ణారావు చదువు చెప్తుంటే. ఆనాటి లాగానే తండ్రీ కొడుకులు యిద్దరూ పాసయ్యారు పి. యు. సి. మరి మూడు సంవత్సరాల తర్వాత, తండ్రి బి. ఎ. పరీక్ష, కొడుకు బి. యస్. సి. పరీక్ష వ్రాశారు.

* * *

కాంగ్రెసేతర ప్రభుత్వాలు దేశాన్ని ఎలా వుద్ధరిస్తాయా అని ప్రజలంతా ఎదురు చూస్తున్నట్లు, పరీక్షాఫలితాల కోసం ఎదురు చూస్తున్నారు, పరీక్షలు వ్రాసినవాళ్లు.

కొడుకు ఫస్ట్‌క్లాస్ వస్తుందా, డిస్టింక్షన్ వస్తుందా అని ఆలోచిస్తుంటే, సూర్యారావు పాసవుతానా లేదా అని ఆలోచించసాగేడు.

ఆయన అన్ని పేపర్లు బాగానే వ్రాశాడు. కాని ఎకనమిక్స్ పేపరు మాత్రం బాగా వ్రాయలేకపోయానన్న భయం వుంది. మొదటినుంచి ఆ 'ఎకనమిక్స్' అతన్ని వేధిస్తూనే వుంది. పి. యు. సి. లో 'లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీ అంటూ ఏదో చెప్తున్నప్పుడే అనుకొన్నాడు—'యీ సబ్జక్టు నా కొంప కూలుస్తుందని' ఆ 'లా' ఏమిటో అతనికి నోక్కాయక్క అర్థం కాలేదు. చదివితే అసలు బోధ పడలేదు. చివరికి ఎవరో చెప్పారు. 'లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీ అంటే ఏముందండీ, తిసగా తిగా గారెలు చేదు అంటారు చూడండి మనవాళ్ళు. అదే' అని ఆ సామెతతో సమన్వయం చేసుకుంటూ చదివితే కొస్త అర్థమయింది.

అప్పటినుంచి ఆ 'ఎకనమిక్స్' అంటే భయమే. ఉద్యోగాల్లో పెద్దలు కేస్తు వాళ్ళకు ప్రిఫరెన్సు యిచ్చినవిధంగా దానికి ప్రిఫరెన్సు యిచ్చి చదువుతూనే వున్నాడు. అయితేనేం లాభం? పగపట్టిన ఆఫీసరు గుమాస్తా 'కాన్ఫిడెన్షియల్' రిపోర్టు చెడగొట్టినట్లు, ఆ 'ఎకనమిక్స్' అతన్ని పరీక్షనాడు హాలెయ్యనే వేసింది. చదివినవి చాలా రాలేదు వచ్చిన వాటిని సరిగా ఆన్సర్ చేశానన్న నమ్మకం కుదుర్లేదు సూర్యారావుకు.

ఫలితాలు ప్రకటించేరోజు దగ్గర పడే కొద్దీ ఆఫీసులో అంతా సూర్యారావు విషయమే మాట్లాడుకోసాగేరు. అతని సర్వీసు యింకో ఆరునెల్లో ఎనిమిది నెల్లో వుంటుంది. బి. ఎ. కాగానే ఎమ్. ఎ. చదువుతాడా? బి. యిడి. చదువుతాడా? లేక ఏం చేస్తాడు?...యమ్మే చదవమని కొందరు సలహా యిచ్చారు. బి. యిడి చదివి రిటైరయ్యాక ట్యూషన్లు చెప్పుకొమ్మన్నారు మరికొందరు. చివరి రోజు పెద్ద ఆఫీసరుకూడా యిదే విషయం అడిగాడు.

'ముందు పాస్ కానీయండి సార్' అని జవాబిచ్చాడు సూర్యారావు

'అదేమిటి? పాసు కావా ఏమిటి?... నాకు తెల్సు నువ్వు పాసవుతావు. అలాగే రిటైరయ్యాక యమ్మేకూడా చదువు' నవ్వుతూనే అన్నా ఆఫీసరుగారి నవ్వులో వ్యంగం వుంది. ఎగతాళి వుంది.

తన చదువును గురించి, భవిష్యత్తును గురించి అందరెందుకింత శ్రద్ధ చూపాలో, సలహా లివ్వాలో సూర్యారావు కర్థంకాలేదు. కాగా అందరికీ తన చదువు ఎగతాళి వ్యవహారం అయిందని తెల్సుకొన్నాడు ఒకవేళ తను...తను ఫెయిలయితే వీళ్ళంతా తనని రేషన్ షాపు వాళ్ళలా కాల్చి కాల్చి చంపరూ? కాకుల్లా పొడవరూ?

అనుకొన్న రోజు రానే వచ్చింది. ఆ వేళ పేపర్లో, డిగ్రీక్లాసులు పరీక్షా ఫలితాలు మరునాటిరోజు ప్రకటిస్తామని వేశారు.

'నేను యమ్మెస్సీ చదువుతాను నాన్నా' అన్నాడు కృష్ణారావు ఆ రాత్రి భోజనాల దగ్గర.

'కానియరా. రిజల్ట్సు రానియ్ ఆలోచిద్దాం'

'రిజల్ట్సు వచ్చేదేమిటి నాన్నా? నేను చెప్తున్నాగా — నాకు కనీసం ఫస్టుక్లాసు ఖాయం. డిస్టింక్షన్ కష్టం — చెప్పలేను—'

కొడుకు ధైర్యంగా అంటున్న మాటలను విని ఆ తండ్రి హృదయం పొంగిపోయింది. అంత ధైర్యంగా తను ఫస్టుక్లాసులో పాసవుతానని చెప్పగల కొడుకు లెంతమంది కుంటారు? తన అదృష్టం వల్ల తనకలాంటి కొడుకు గిరిగాడు!

సూర్యారావుకు తన తలితండ్రులు జ్ఞాపకం వచ్చారు. పాపం వారు తమ కోరిక తీరక ఎలా బాధపడ్డారో? యివాళ వాళ్ళే బ్రతికివుంటే కొడుకు తీర్చని తమ కోరికను మనుమడు తీరుస్తున్నందుకు ఎంత వుబ్బిపొయ్యేవారో ?!

యమ్మెస్సీయేకాదు, కొడుకు ఎంతవరకు చదువుతానన్నా, అన్నం మానేసైనా చదువు చెప్పించాల్సిందే.

'అలాగే చదువరా నాన్నా, నువ్వు ఫస్టు క్లాసులో పాసుకాంగా. నేను యమ్మెస్సీ చెప్పించనా? తప్పక చెప్పిస్తాను' అన్నాడు ఆనందం నిండిన హృదయంతో.

'తెల్లవారేసరికి పేపరు తీసుకొచ్చి చూపిస్తాగా—' అంటూ పడుకొని నిద్రపోయాడు నిర్భయంగా—కృష్ణారావు.

కాని సూర్యారావుకు ఎంత ప్రయత్నించినా ఆ రాత్రి నిద్రపట్టలేదు. బీహారులో ఆకలిలా ఆలోచనలు విజృంభించాయి. ఆలోచించగా, తను చదవటం పొరపాటేనేమో ననిపించిందాయనకి! కాకపోతే, కొడుకు తెలివితేటలు చూచి ఆనందించాల్సిన యీరోజుల్లో, తగదునమ్మా అంటూ కాలేజిలో చేరి చదవట మేమిటి?

తెల్లవారుజామునే లేచి కృష్ణారావు వాకిట్లోకి వెళ్ళటం గమనించాడు. వస్తుంది ... పేపరు వస్తుంది. కొడుకు పాసవుతాడు. తాను? ... పాటమిని ఎదు



ర్కొనటానికి, పరిహాసాల్ని భరించటానికి, కొన్నిగంటల వ్యవధి కూడా లేదు. ఆ ఓటమిని తాను భరించలేడు. ఆ పరిహాసాల్ని తను సహించలేడు. ఆ బాధ... ఆ బాధ...తనకొద్దు...ఆవేళప్పుడు ఆయనకు చిన్న కునుకుపట్టింది.

'నాన్నా ... పేపర్లో మీ రిజల్ట్సు వచ్చాయి నాన్నా' అని చిన్నపిల్లలు పేపరు చేతుల్లో పట్టుకొని, తనని కుదిపి లేపితే కాని మెలకువ రాలేదు సూర్యారావుకు. 'దడదడ కొట్టుకొంటున్న గుండెలతో పేపరు తీసుకొని చూచాడు! 'మూడో పేజీలో పరీక్ష ఫలితాలు' అని పెద్ద అక్షరాలు!

మూడో పేజీ తెరవబోతూ ఒక్క నిముషం ఆగి ఆలోచించాడు. ఫెయిలవటం ఖాయం అని తెల్సికూడా తను రిజల్ట్సు చూచుకోటానికి యిప్పుడు ఆత్రుత పడుతున్నాడు. కొడుకు ఫస్టుక్లాసులో పాసవుతాడని తెల్సికూడా తెల్లవారుజామునే లేచి పేపరుకోసం వెళ్లాడు. చిత్రంగా తోచింది!... 'అన్నట్లు వాడు— కృష్ణుడింకా రాలేదే?' అనుకొన్నాడు.

మూడో పేజీ తెరవనే తెరిచాడు. ఆత్రంగా తన నెంబరుకోసం వెతికాడు. ఊహూ ... ఎందుకుంటుంది? సూర్యారావు మొహం నల్లగా కళావిహీనమైపోయింది. గుండెబాధతో వాడిపోయింది. ఒళ్లంతా నిముషంలో వేడెక్కి చెమటలు పట్టింది.

అంతలోనే ఏదో ఆశ! వెధవ ఆశకు అంతరాలు తెలియవు.

సెకండ్‌క్లాసుల లిస్టు వెతికాడు. ఊహూ...ఫస్టుక్లాసుల లిస్టు ... వెతుకుతుంటే సూర్యారావుకే నవ్వొచ్చింది. నవ్వుకుంటూనే చూచాడు. చిత్రం ... అరెరె చిత్రం ... ఆయన నెంబరు ఫస్టుక్లాసుల లిస్టులో వుంది!!

సూర్యారావుకు తల తిరిగింది. గుండె కొట్టుకొనే వేగం హెచ్చింది. తను...తను... ఫలాని నెంబరుగల తను...నిజంగా ఫస్టుక్లాసులో బి. ఎ. పాసయ్యాడా?...ఆయనకి పెద్దగా అరవాలనిపించింది. పిల్లల్లా ఎగరాలనిపించింది. కాని వయసు వారించింది. నెమ్మదిగా వంట యింట్లోకి నడిచి వెళ్లి—'నేను ఫస్టుక్లాసులో పాసయ్యానే దుర్గా' అన్నాడు భార్యతో. అంతలి వే

# చదువు

ఆయనకు — 'యీ మాటలు ఆ నాడు తలితండ్రులకు చెప్పి వుంటే ఎంత సంతోషించేవారు —' అని అనుకొని, వాళ్ల పాదాలకు మనసులో నమస్కరించేడు.

భర్త మాటలు విన్న దుర్గాంబ ఆశ్చర్యపోయిందే కాని ఆనందంతో మొహం చాటంత కాలేదు. కాని విస్తుపోతున్నట్లు బుగ్గన వేలేసుకొని— 'ఏం చోద్యమమ్మా? చిన్న పిల్లాడిలా వచ్చి పాసయ్యానని గర్వంగా చెప్పుకొంటున్నాడు. నాకు తెలీ కడుగుతాను—యిప్పుడు తను పాసయి ఎవర్ని ఉద్ధరించాలిట!? ఏమిటో—యాభై ఏళ్లు దాటి మనవలు మనవరాండ్లు కలిగేక బి. ఎ. పాసయితేనేం? ఫెయిలయితేనేం? పిల్లవాడు పాసయ్యాడో లేదో చెప్పటం లేదు కాని—'

అప్పటిగ్గాని తన గొడవలో పడి కొడుకు రిజల్టు యింతవరకు చూడలేదన్న విషయం జ్ఞాపకం రాలేదు. లాగానే సిగ్గుపడ్డాడు. స్వార్థం మమతను కూడ వోడించటం మానవతకు తుది మెట్టుగా తోచింది. కాకపోతే — భార్య అన్నట్లు — అన్నీ అయిపోయిన తను పాసయితేనేం, ఫెయిలయితేనేం? ఎవరివ్వాలి? ఎవరాలోచించిరా భవిష్యత్తుకు వారసుడైన కొడుకును గురించే. అటువంటిది తను... తన స్వార్థానికి విచారించాడు!

'వాడికేం లేవే—ఫస్టుక్లాసులో పాసవుతాడు' అంటూనే వాడి నెంబరు వెతికేడు. కాని వాడి నెంబరు...డిస్టింగ్షన్, ఫస్టుక్లాసు, సెకండు ... చివరికి థర్డుక్లాసు లిస్టులో కూడా లేక పోవటం ఆయనకు ఆశ్చర్యాన్ని బాధనీ కలిగించింది.

తన కొడుకు ఫెయిల్...తనకు ఫస్టుక్లాసు!... అసహజంగా తోచింది సూర్యారావుకు. నమ్మలేక పోయాడు వో రాగాన!

'అలా చూస్తూ మాట్లాడరేమండీ? ఏమయింది నా తండ్రి పాసయ్యాడా?' ఆత్రంగా అడిగింది భార్య.

కొడుకు తెలివి తేటలకు మురిసిపోతూ, వాడి మీదే ఆశలు బోలెడన్ని పెట్టుకొని వున్న భార్యకీ విషయం ఎలా చెప్పాలో తోచలేదాయనకు. చివరికి తెగించి నెమ్మదిగా అన్నాడు— 'లేదు దుర్గా — మనవాడి నెంబరు యిందులో లేదు—'

కాని ఆమె ఆయన మాటల్ని నమ్మలేదు. భర్త తనతో పరాచకాలాడుతున్నాడనుకొంది.

తను పాసయిందానికి సంతోషించాలో, కొడుకు ఫెయిలయిందానికి విచారించాలో తెలీని స్థితిలో వున్న సూర్యారావుకి — కొడుకు యిద్దరు మనుషుల సహాయంతో, టాక్సీలో నుంచి దిగి రావటం కన్పించింది. తలితండ్రులను చూస్తూ తల వంచుకొని కన్నీరు కార్చాడు కృష్ణారావు ఆ స్థితిలో కొడుకును చూడగానే ఘొల్లుమంది దుర్గాంబ.

బజార్లో రోడ్డుమీద పరధ్యానంగ నడిచి వస్తుంటే కృష్ణారావుకు యాక్సిడెంటయిందని వచ్చిన వ్యక్తులు చెప్పేరు. పరధ్యానానికి కారణం సులభంగానే గ్రహించగలిగాడు సూర్యారావు.

'నేను ఫెయిలయ్యాను. నన్ను క్షమించ నాన్నా—' అన్నాడు కృష్ణారావు పక్క మీద పడుకొని కన్నీరు కారుస్తూ.

'ఛఛ... వూరుకో కృష్ణా, ఈ మాత్రానికే ఏడుస్తారా? యీసారి పాసవుదువుగాని—' అన్నాడు వోదార్పుగా.

సూర్యారావు ఫస్టుక్లాసులో పాసయ్యాడని తెల్సి ఆఫీసులో అంతా ముక్కుమీద వేళ్ళు వేసుకొన్నారు. జూనియర్‌కి ప్రమోషన్ వచ్చినప్పటిలా, మొహాలు వేలవేసుకొని వున్న వాళ్లను చూచి సూర్యారావు హృదయం ఆనందంతో వుప్పొంగింది. మనసులో ఎన్ననుకొన్నా పైకి మాత్రం అంతావచ్చి 'కంగ్రాచ్యులేషన్స్' చెప్పేరు. చివరికి ఆఫీసరు కూడా పిలిపించి— 'వెరీ గుడ్ సూర్యారావు. అయామ్ వెరీ హాప్పి మీరు యీ రోజు యువతరానికి మార్గదర్శకులై నిల్చేరు. మీలా అంతా కష్టపడ్తే దేశం ఎంత సేపండీ ముందుకు పోవటం' అంటూ వుపన్యసించాడు.

అయితే మొహం ఎదటే యీ పొగడ్తలు, కంగ్రాచ్యులేషన్స్! వెనుక సాగుతున్న గుసగుసల్ని గమనించాడు సూర్యారావు.

'ఆ—ఎవర్నో కాకా పట్టేశాట్ట—'

'కాళ్ల మీద పడి బ్రతిమలాడు

కొన్నాట్ట కూడానూ!'

'ఇక యిమ్మె కూడా అయితే, అర గజుల సవారి ఎక్కవచ్చు—'

మచ్చుకు కొన్ని గుసగుసలు మాత్రమే యివి!

ఆఫీసు పోకడను, యన్‌జివో మెంటాలిటీని తల్చుకొని సూర్యారావు పాను భూతితో నవ్వుకొన్నాడు!

ఆ రాత్రి కొడుకు ఫెయిలయినందుకు కాస్సేపు విచారించినా తన చిరకాల వాంఛితం ఆవేళ నెరవేరినందుకు, తనూ సూర్యారావు-బి. ఎ. అయిన విషయాన్ని పదే పదే తల్చుకొని, ఆనందంతో, హాయిగా నిద్రపోయాడు సూర్యారావు!

*   *   *

కృష్ణారావుకు ఎంతకూ నిద్రపట్టలేదు ఆ రాత్రి. తను ఫెయిలయ్యాడన్న విషయాన్ని ఎంత నమ్మదామనుకొన్నా నమ్మలేకపోతున్నాడు. తను ఫెయిల్ కావటమేమిటి? అన్ని పేపర్లలో అన్ని కొశ్చన్లూ కరెక్టుగా ఆన్సర్ చేశాడు తాను. మరి ఎలా ఫెయిలయ్యాడు — ఎలా?...

కళ్ళల్లో కొవ్వొత్తులు వేసుకొని అలాగే తెల్లవారిందాకా పడుకొన్నాడు. 'పేపర్' అన్న కేక విని, కాలిదెబ్బను కూడా మర్చిపోయి ఛంగున లేచి పేపరు అందుకొన్నాడు.

ఆత్రంగా పేపరు తెరిచాడు. తన నెంబరు పొరపాటుపడి వుంటుందని అతని నమ్మకం. కరెక్షన్‌కోసం వెతికాడు. అనుకొన్నట్లుగానే కరెక్షన్‌వుంది. అయితే వొకటి కాదు. రెండుమూడున్నాయి. కరెక్షన్ ప్రకారం తను ఫస్టుక్లాసులో పాసయ్యాడు. కానీ...కానీ...తన తండ్రి... తనతండ్రి ఫెయిలయ్యాడు.

కృష్ణారావు సంతోషం, భోగిమంటలా యింతలోనే పైకెగసి, అంతలోనే చప్పగా చల్లారిపోయింది. తండ్రి పాసయ్యాననుకొని సంతోషిస్తున్నాడు. ఈ వార్త యిప్పుడు చెప్తే విని భరించగలడా?

చివరికి నెమ్మదిగా నడిచి తండ్రి గదిలోకి వెళ్ళేడు. ఆయనింకా లేచినట్లు లేదు. కళ్ళుమూసుకొని ప్రశాంతంగా పడుకొని వున్నాడు. ఆయన మొహంలో సంతోష చిహ్నాలు; ఆనందరేఖలు, నిద్రలో కూడా స్పష్టంగా కన్పిస్తున్నాయి.

'నాన్నా—' అని మెల్లగా పిల్చాడు కృష్ణారావు. సూర్యారావు కదల్లేదు.

'నాన్నా...నేను కూడా ఫస్టుక్లాసులో పాసయాను నాన్నా—' అంటూనే తండ్రి చేతుల్ని పట్టుకొని కుదపబోయాడు. చల్లగా తగిలాయి ఆయన చేతులు.

ఒక్క క్షణం నివ్వెరపోయి, అర్థంకాని రీతిలో తండ్రి వైపు చూచాడు. అతనికి కంటి వెంబడి నీళ్ళు తిరిగాయి. తనను కని, పెంచి విద్యాబుద్ధులు చెప్పించిన తండ్రి-దైవసమానుడైన తండ్రి!... తాను పాసయ్యాసని ఆ తండ్రికి చెప్పలేడు. తను ఫెయిలయానని ఆయన తెల్సుకోలేడింక. కొడుకు ఫెయిలయినందుకు విచారిస్తూ, తాను పాసయినందుకు సంతోషిస్తూ, తృప్తిగా కళ్ళమూసి వుంటాడాయన!

'నాన్నా.. నేను ఫెయిలు కాలేదు నాన్నా. నీ ఆశలు భంగం చెయ్యలేదు. నేను ... పాసయ్యాను...నేను పాసయ్యాను నాన్నా—' తండ్రి పైన పడి వెక్కివెక్కి ఏడ్చాడు కృష్ణారావు

ఒక్క క్షణంలో ఆ యిల్లు ఏడుపులతో, నిండిపోయింది. పదింటికల్లా ఆఫీసులో అందరికీ తెల్సింది. ఆ వెంటనే అసెంబ్లీ రిజిస్టరులో ఆ విషయం నమోదు చేయబడింది.

ఆవేళ పదిన్నరకు—ఆఫీసులో వాళ్ళంతా సమావేశమై సూర్యారావు అకాల మరణానికి సంతాప సూచకంగా రెండు నిమిషాలు మౌనంగా నిల్చున్నారు.

ఆయన ఫెయిలయ్యాడని తెల్సికూడా తెలీనట్లే, ఆయనకు చదువుపట్లగల శ్రద్ధను, పట్టుదలను, ఆయనకు 'డ్యూటీ' పట్లగల గౌరవాన్ని తల్చుకొని అంతా కన్నీళ్ళతో వుపన్యాసాలిచ్చారు. ఆయన ఘనతను వేయినోళ్ళతో పొగిడారు. సమయం చూచుకొని, ఫెయిలు కావటం తెల్సి ఆయన ఆత్మహత్య చేసుకొన్నాడన్న పుకారు కూడా పుట్టించారెవరో!

ఏమైతేనేం? బ్రతికుండగానే ఆయన హృదయాన్ని సూటిపోటిమాటలతో చిల్లులు పొడిచిన మనుష్యులంతా, చనిపోయిన ఆయన ఆత్మకు శాంతి కల్గాలంటూ భగవంతుణ్ణి ప్రార్థించారు! తీర్మానాలు పాసుచేశారు!!

కాని వాళ్ళకేం తెల్సు? అనుకొన్నపని నెరవేరటంతో, ఆయన ఆత్మ శాంతించిందనీ, ఆయన ప్రశాంతంగానే చనిపోయాడనీన్నూ!! ●



# సినిమా



'నిలువుదోపిడి'లో దేవిక, ఎన్. టి. రామారావు.

వాహిని స్టుడియోలోని రెండవ ఫ్లోర్‌లో ప్రముఖ దర్శకులు రామినీడు వున్నారని తెలిసి లోపలి కెళ్లాను. ముఖద్వారంవద్దనున్న నిర్మాతల్లో ఒకరయిన శ్రీ వి. సత్యనారాయణ సెట్టుకు తీసికెళ్లి తమ పార్ట్‌నర్ శ్రీ విక్రంసింహను పరిచయం చేసారు. వీరిద్దరూ కలసి స్థాపించిన సంస్థయే బాలా ప్రొడక్షన్స్. శ్రీ రామినీడు దర్శకత్వంతో నిర్మింపబడే ఒూ చిత్రంలో శ్రీమతి జమున తల్లి, కూతుళ్ళగా ద్విపాత్రాభినయం చేస్తున్నారు. శ్రీ గుమ్మడి, హరనాథ్, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రమాప్రభ, కాకరాల, టి. జి. కమలాదేవి ప్రముఖ పాత్రల్ని పోషిస్తున్నారు' శ్రీ దాసం గోపాలకృష్ణ రచన, స్వామి కెమెరా, చాంద్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. చిత్రాన్ని మూడు మాసాల గడువులో ముగించాలనే ప్రయత్నంలో వున్నట్లు నిర్మాతలు వెల్లడించారు.

* * *

మనకున్న మంచి దర్శకుల్లో రామినీడు ఒకరు అని అంటే మీరు ఒప్పుకుంటారనుకుంటా? వీరు డైరెక్టు చేసిన 'చివరకు మిగిలేది' 'మా యింటి మహాలక్ష్మి', 'కలిమిలేములు', 'పల్నాటి యుద్ధం', 'భక్త పోతన' ఆర్థికంగా విజయవంతం గాకపోయినా ప్రెసెంటేషన్ చక్కగా వుందనడంలో తప్పులేదేమో! ఇప్పుడు బాలా ప్రొడక్షన్స్ చిత్రాన్ని, ఏప్రిల్‌నుండి 'ఖడ్గ తిక్కన'ను వీరు డైరెక్టు చేస్తున్నట్లు వెల్లడించారు.

**'ఆడవాళ్ళకి దోషం లేదు'**

రెండవ ఫ్లోర్‌నుండి బయటపడ్డానా లేదో ఆరుబయట విజయనిర్మల, రమాప్రభ విల్చుని ఒక గ్లాసు కాఫీని యిద్దరూ రుచి చూడడం గమనించి 'ఇదేమిటమ్మా ఒకరి ఎంగిలి మరొకరు త్రాగుతున్నారే' అన్నాను. దానికి విజయ



'పగటిదొంగలు'లో భారతి,

నిర్మల నవ్వి 'ఆడవాళ్లకు దోషంలేదు' అన్నది. ఆ రోజు విజయనిర్మల 'అత్తగారు కొత్తకోడలు' చిత్రానికిగాను 'మీరాబాయి' గెటప్‌లో అచ్చం సన్యాసినిలాగ వుండిందంటే నమ్మండి. 'ఎందుకమ్మా బైరాగిని వేషం వేశావు?' అని అడిగాను. 'ఈ చిత్రంలో మా అత్తగారయిన సూర్యకాంతానికి మస్కా కొట్టేందుకు యిది ఒక ఎత్తు' అన్నది. విజయ నిర్మల ప్రస్తుతం ఎనిమిది తెలుగు చిత్రాల్లో, నాలుగ తమిళ చిత్రాల్లో మూడు మలయాళ చిత్రాల్లో నాయికగా నటిస్తూంది. ఈమెకు పెండ్లి అయి, ఒక అబ్బాయి



'దబ్బారాయుడు-సుబ్బారాయుడు'లో కె. ఆర్. విజయ, నచ్చు.

కూడ వున్నాడని చెప్తే ఎవ్వరూ నమ్మరు. ఇప్పటికీ 16 ఏండ్ల యుక్త వయస్కు రాలిగానే కన్పడుతూంది. ఈమె విశ్వనాథ పురంలో స్వంత యింట్లో కాపురం చేస్తూవుంది.

**'దీపం ఉండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి'**

విజయనిర్మలతో మాట్లాడి వస్తూంటే కృష్ణ యెదురుపడ్డాడు. శ్రీ నాగేశ్వర రావు, రామారావుల తర్వాత యెక్కువ పిక్చర్లు వున్న నాయకుడు కృష్ణ. అదృష్ట జాతకుడు. ఇతడు యిటీవల



'కాంభోజరాజుకథ'లో ఎల్. విజయలక్ష్మి.

నటించి విడుదలయిన 'అసాధ్యుడు' బాగా ఆడుతున్నట్లు వార్తలొస్తున్నాయి. 'ఏమిటీ కబుర్లు?' అని కృష్ణను అడిగాను. 'ఏముంది మద్రాసుకు, హైద్రాబాదుకు తిరగలేక తంటాపడ్తున్నా. ఏం చెయ్యమంటారు. 'దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలిగా' అందుకే వచ్చిన యే చిత్రాన్ని వదులుకోవడంలేదు'అన్నాడు. అతి త్వరలోనే 'కారు' కొనదల్చుకున్నట్లు కూడ చెప్పాడు.

*　　*　　*

సారథిలో జనవరి 10 నుండి 16 వరకు 'అమాయకుడు' షెడ్యూలు జరిగింది. ఒక పాటను జమున, కృష్ణలపై



'అసాధ్యుడు'లో కె. ఆర్. విజయ, కృష్ణ.

దర్శకుడు శ్రీ ఆడ్డాల నారాయణరావు చిత్రించారు. హిందీలో రాజ్‌కపూర్ నూతన్‌లు ధరించిన పాత్రల్ని తెలుగులో కృష్ణ, జమున నటిస్తున్నారు.

*　　*　　*

జనవరి 16 నుండి 21 వరకు పద్మశ్రీ 'వింత కాపురం' షూటింగు జరిగింది. అందులో కాంచన, కృష్ణ, పద్మనాభం, రమాప్రభ, అల్లు రామ లింగయ్య పాల్గొన్నారు. మరలా జనవరి 27 నుండి ప్రారంభమైంది. శ్రీ వెంకటేశ్వర్లు వేసుకున్న షెడ్యూలు ప్రకారంగా చిత్రం ఏప్రిల్‌కు మీ ముందు వుంటుంది. శ్రీ అబ్బి డైరెక్టు చేస్తున్న మొదటి చిత్రం యిది.

**'కారు కదిలేదాకా అల్లరి'**

హైద్రాబాదు 'వింత కాపురం' షూటింగులో పాల్గొనడానికి వెళ్లినప్పుడు అక్కడ జరిగిన ఒక 'తమాషా'ను రమాప్రభ వెల్లడించింది. అదేమిటో తెలుసా! 'ఒకరోజు నేను, పద్మనాభం, అల్లు రామ లింగయ్య 'పూలరంగడు' సినిమా చూడడానికి బయల్దేరాం. మధ్యలో మేము వెళ్లిన కారు ఆగిపోయింది. ఆ సమయంలో నేను, అల్లు రామలింగయ్య 'ఏయ్‌రా...నా స్వామి ఏయ్‌రా' అని డ్యాన్సు



'సుఖదుఃఖాలు'లో రామకృష్ణ, జయలలిత.

చేసి వారు ప్రిట్స్ అయ్యేంతదాకా అల్లరిలో గడిపేశాం' అన్నది రమాప్రభ.

**హిందీ నటులతో ముచ్చట్లు**

'హిందీ సినిమా నటులు రాజేంద్ర కుమార్, శశికపూర్ మా యింటికి 'టీ'కి వచ్చారండీ' అన్నది రమాప్రభ 'వాళ్లతో మనసిచ్చి యెన్నో విషయాలు ముచ్చటించారు. అదే విధంగా బిశ్వజిత్‌ను, 'పద్మశ్రీ' నర్గీస్‌ను కూడ మా యింటికి పిలిచి మనసు విప్పి మాట్లాడాలని వుంది. ఇది తీరే రోజు యెప్పుడో' అని వాపోయింది. 'పద్మశ్రీ భానుమతిని చూడాలని చాలా ఆశగా వుండేది. ఆ ఆశ యిటీవలనే

## సినిమా

ముదుకు పూజ నివిధంగా తీరింది. హైదరాబాదు నుండి వస్తు, భానుమతిగారు ఒక కంపార్టుమెంటులో ప్రయాణం జరిగింది' అన్నది రమాప్రభ. కల్లా కపటం లేని 'భోళా' మనిషి రమాప్రభ. పరిశ్రమలో కూడ మంచి పేరు సంపాదిస్తానే వుంది.

* * *

రాజా పిక్చర్స్ నిర్మించే జానపద చిత్రాన్ని శ్రీ సుబ్బరామదాస్ డైరెక్టు చేస్తారు. వీరి మొదటి పాట రికార్డింగ్ విక్రం స్టూడియోలో ఫిబ్రవరి 1న

## సినిమా డైరీ

● ఇటీవల ఘోర ప్రమాదానికి గురి అయిన ప్రముఖ హీరోయిన్ రాజశ్రీ భర్త శ్రీగారికి గుండెలో ఒక ఎముక విరిగినట్లు ఆ ప్రదేశంలో శస్త్ర చికిత్స జరిగి యిప్పుడు కోలుకుంటున్నట్లు డాక్టర్లు వెల్లడించారు.

● కల్పనా "అత్తగారు— కొత్త కోడలు" చిత్రంలో సత్యనారాయణ భార్యగా నటించేందుకు పుష్పకుమారిని నిర్మాత శ్రీ బాబురావు నిర్ణయించారు.

● కమల్ బ్రదర్స్ నిర్మించే రెండవ చిత్రంలో రవిచందర్—భారతి ముఖ్య పాత్రల్ని పోషిస్తున్నారు. శ్రీ దేవన్ డైరెక్షన్‌లో యీ చిత్రంయొక్క షూటింగు జనవరి 18న గోల్డెన్ స్టూడియోలో ప్రారంభమైంది.

● "పొన్నాన వాళ్వై" చిత్రాన్ని నిర్మించిన పుమగల్ ప్రొడక్షన్స్ తమ రెండవ చిత్రం యొక్క షూటింగును ఫిబ్రవరిలో ప్రారంభిస్తారు. ఇందులో జయశంకర్‌తో నటించడానికి కాంచన, రాజశ్రీలను నిర్ణయించారు.

● బెర్లిన్ ఫిలిం ఫెస్టివల్‌కు "కేదార్‌రాజ" అనే వంగ భాషా చిత్రాన్ని ఫిలిం కవి.టీ పంపడానికి నిర్ణయించింది.

● ప్రముఖ నేపథ్యగాయకుని కుమారుడు చిరంజీవి నితిన్ రాజకపూర్ నిర్మిస్తున్న "మేరా నామ్ జోకర్" చిత్రంలో ఒక ఆంగ్ల పాటను మృదు మధురంగా పాడాడు.

● మేఖలా పిక్చర్స్‌లో నటించేందుకు ఎం. జి. రామచంద్రన్ అంగీకరించారు.

● ప్రముఖ నటి వాణిశ్రీ ఎ. వి. ఎం. నిర్మించే హిందీ చిత్రంలో నటించేందుకు ఒప్పుకుంది.

● రాజలక్ష్మి, సుజాతా నిర్మించే చిత్రాన్లో కథానాయకుడి వేషానికి కృష్ణను నిర్ణయించారు.

● శ్రీ దిలీప్‌కుమార్, వహీదా రహ్మాన్, మనోజ్ కుమార్ నటించిన "ఆద్మీ" హిందీ చిత్రాన్ని శ్రీ పి. ఎస్. వీరప్ప నిర్మించారు. ఈ చిత్రం రిపబ్లిక్ దినం నాడు విడుదలయింది.

● నాగేశ్వరరావు, జయలలితలు ప్రధాన పాత్రలను పోషించిన ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ "బ్రహ్మచారి" ఫిబ్రవరి 1వ తేదిన ఉదయం ఆటతో ప్రారంభమవుతుంది.

● అన్నై ఫిలింస్ "పణక్కార పిళ్లై" షూటింగు కొచ్చిన్‌లో జరిగింది. అక్కడ రెండు యుగళ గీతాల చిత్రీకరణ జరిగింది. రవిచందర్, జయలలిత, 'రాజ, రాణి'లుగా నటించిన సన్నివేశాన్ని డైరెక్టరు జంబులింగం చిత్రీకరించారు. ఈ చిత్రంలో రవిచందర్ ద్విపాత్రాభినయం చేస్తున్నారు.

● శ్రీ జ్యోతి పిక్చర్స్ నిర్మిస్తున్న "ముఖజాడుం పార్వై" చిత్రకథను తెలుగు రచయిత రాజశ్రీ వ్రాశారు. ఇందులో రవిచందర్, రాజశ్రీ ముఖ్య పాత్రధారులు.

● ప్రసాద్ ఆర్ట్స్ అనే నూతన నిర్మాణ సంస్థ నిర్మించే సాంఘిక చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని ప్రముఖ తమిళ దర్శకుడు కె. బాలచందర్ డైరెక్టు చేస్తున్నారు. ఇది ఒక సంపూర్ణ హాస్య చిత్రం.



ఉమా చండీ గౌరీ శంకర కథ'లో బి. సరోజాదేవి

సత్యం సంగీత దర్శకత్వంలో జరిగింది. వేటూరి వ్రాసిన యీ పాటను శ్రీమతి సుశీల కమ్మగా పాడారు. చిత్రంలోని ప్రధాన పాత్రల్ని కాంతారావు, రాజశ్రీ, రాజనాల, గీతాంజలి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, బాలకృష్ణ, మీనా కుమారి, అల్లు రామలింగయ్య ధరిస్తున్నారు. శ్రీ నాగేశ్వరరావు ఆర్టు విభాగానికి దర్శకులు. చిత్రంలో విన్పడే మొగ గొంతు పాటలన్నింటినీ యువకుడు బాల సుబ్రహ్మణ్యం పాడడం ఒక విశేషం. చిత్రం యొక్క షూటింగు ఫిబ్రవరి 16 నుండి విక్రంలో జరుగుతుందని నిర్మాతల్లో ఒకరయిన బి. వీరరాజు వెల్లడించారు.

* * *

ప్రతి ఏడాది సంక్రాంతి శుభదినం బెంగుళూరులోని 'తెలుగు విజ్ఞాన సమితి' వారు 'రవీంద్ర భారతి'లో ఉత్తమ కళాకారులను సన్మానించడం పరిపాటి. గత

తప్పక చూడండి!

శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్ సమర్పించు

# చిక్కడు దొరకడు

దర్శకత్వం: బి. విఠలాచార్య

నిర్మాతలు: పోట్లూరి వెంకటనారాయణ రావు. కుదరవల్లి సీతారామస్వామి

లక్షలాది ప్రజలు చూసి

శభాష్! అని మెచ్చుకుంటున్న

మేటి చిత్రం!

ఆంధ్ర. రాయల
సీడెడ్. జయలక్ష్మి
నైజాం. దివ్యదత్తా
మైసూర్. మాదేశ్వర

Geetha

VIJAYA

సంవత్సరం అక్కినేని సన్మానింప బడ్డారు. ఈ ఏడాది గుమ్మడి వెంకటేశ్వరరావుకు ఘనంగా బెంగుళూరు 'రవీంద్ర భారతి'లో వాణి పంపిణీదారులయిన శ్రీ సురేంద్ర నాథ్ బెనర్జీలాంటి ప్రముఖుల సమక్షాన సన్మానం జరిగింది. 'బెంగుళూరు ప్రేక్షక మహాశయులు వ్యక్తపర్చిన అభిమానాన్ని, ఆనందాన్ని యెన్నడూ మరువలేను' అన్నారు గుమ్మడి.

## గోల్‌కొండలో క్లయిమాక్స్

'గోల్కొండ కోటలో రెండు యూనిట్స్ పర్కు చేసాయండీ' అన్నారు రామా నాయుడు. మద్రాసులో 20వ తేది బయల్దేరి 26 వరకు హైదరాబాదులో మకాంవేసి, లక్షరూపాయలకు పైగా ఖర్చుపెట్టి 'పాపకోసం' క్లయిమాక్స్ సన్నివేశాల్ని చిత్రీకరించినట్లు, 'ప్యాచ్' వర్కు మాత్రం మిగిలినట్లు నాయుడు వ్యక్తపర్చారు.

ఒక యూనిట్‌కు శ్రీ ప్రకాశరావు, వెంకటరత్నం దర్శక, ఛాయాగ్రాహకులుగా పనిచేసారు. రెండవ యూనిట్‌కు శేషగిరిరావు, గోపాలక్రిష్ణ దర్శక, ఛాయాగ్రాహకులుగా వ్యవహరించి ముఖ్యమయిన ఘట్టాల్ని పూర్తిచేసి మద్రాసుకు 26న తిరుగుముఖం పట్టారు. అక్కడ జరిగిన షూటింగు వివరం:

ముగ్గురు దొంగల్ని, వారి సంకేతాన్ని సి. ఐ. డి. కనిపెట్టడం, ఇన్‌స్పెక్టర్

# సినిమా

జనరల్ తన బందోబస్తుతో రావడం బ్రహ్మాండమయిన పద్ధతిలో చిత్రించబడింది. చేసింగ్ సీన్‌ను మన తెలుగు చిత్రాల్లో యింతవరకు రాని రీతిగా దర్శకులు చిత్రీకరించారు. గోల్కొండలో జరిగిన షూటింగులో జగ్గయ్య, దేవిక, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, ధూళిపాళ, త్యాగరాజు, రామదాసు, బేబిరాణి పాల్గొన్నారు.

* * *

'పహిల్వాన్' కాంతరావు 'పట్టిందల్లా బంగారం' అని 'అసాధ్యుడు' వసూళ్లు మరొకసారి ఋజువు చేసింది. కాంతరావు, హుసేన్ కలిసి స్థాపించిన టైగర్ ప్రొడక్షన్స్ 'సర్వర్ సుందరం' డబ్బింగ్ చిత్రంలో లక్షరూపాయల్ని గడించారు. ఆ తర్వాత 'సీవే'లో 50వేలయినా వచ్చివుంటుంది. వీరి మూడవ చిత్రమయిన 'అసాధ్యుడు' మొదటి పది రోజులకు 4 లక్షల ఎనభైవేల రూపాయల్ని కలెక్టు చేసిందని యిటీవల కలిసినప్పుడు చెప్పారు. 'అసాధ్యుడు' యిప్పుడు తమిళంలో డబ్ చెయ్యాలనుకుంటున్నట్లు కూడా వెల్లడించారు.

* * *

## గురువు, దైవం, మార్గదర్శి ?

కాంతారావు శరీరం యెంత గంభీరమో, మనస్సు దీనికి రెండింతలు సున్నితము. చిన్నపిల్లవాడిలా మాట్లాడుతూ, మనస్సులోని మాటను దాచకుండా, చేతనయినంతవరకు అందరికీ సహాయపడుతూ, వారి సహాయాన్ని పొందుతూ మంచివాడుగా పేరు తెచ్చుకుంటున్నాడు. ఇతనితోవుండే హుస్సేన్‌కు యితని గుణ విశేషాలు అచ్చుగుద్దినట్లు వచ్చాయంటే - ఇక వారి కాంబినేషన్‌ను గూర్చి మీరే నిర్ణయించుకోండి. నెల్లూరు నుండివచ్చిన ఈ నిర్మాతలు పదికాలాలపాటు మంచిగావుంటూ, ఉత్తమ చిత్రాలను అందివ్వగలరని ఆశిస్తున్నాం. మాకు 'గురువు, దైవం, మార్గదర్శి' అన్నీ శ్రీ డూండీశ్వరరావేనని యిద్దరూ ఒక్కుమ్మడిగా పక్కేసారు.

* * *

'సాక్షి' లాంటి ప్రయోజనాత్మక చిత్రాన్ని నిర్మించిన నందనా ఫిలింస్ తమ రెండవ ప్రయత్నంగా మరియొక ప్రయోగాన్ని మార్చిలో ప్రారంభించడానికి నిర్ణయించారు. ఈ సంస్థను నడిపించే శ్రీ ముళ్లపూడి, బాపులు వున్నత ఆదర్శాలు గల వ్యక్తులు. వీరి రెండవ చిత్రంలో హరనాథ్' విజయనిర్మల ముఖ్య పాత్రధారులు.

* * *

'ప్రియుని బిగికౌగిలిలో స్వర్గసుఖాల్ని ప్రియురాలు అనుభవిస్తూ, ఒకరి శ్వాస, నిశ్వాసాలను మరొకరు పీలుస్తుంటే తమకంతో వారి అంతర్గతంలో యేర్పడిన ఆనందాన్ని కని నారాయణరెడ్డి ఒప్పుకింది విధంగా రచించారు. ఆ కవితామాధుర్యానికి, టి. వి. రాజు సంగీతంలో సుశీల, ఘంటసాల పాడిన విధం బ్రహ్మానందాన్ని కల్గచేస్తుంది.

ప్రియుడు :

'కోవెల ఎరుగని దేవుడు కలడని
అనుకొంటినా నేను యేనాడు
కనుగొంటి... కనుగొంటి.... యీనాడు!'

ప్రియురాలు :

'పలికే జాబిలి- ఇలపై కలదని
అనుకొంటినా నేను యేనాడు
కనుగొంటి — కనుగొంటి—యీనాడు!'

ఈ పాటను సుశీల, మోహనేలుగా కృష్ణకుమారి రామారావులు డి. వి. ఎస్.



'లక్ష్మీనివాసం'లో వాణిశ్రీ, శోభన్‌బాబు. భారతి.

రాజా నిర్మించే 'తిక్కశంకరయ్య' చిత్రంలో నటించగా, శ్రీ యోగానంద్ తన సహజ ధోరణిలో చక్కని ఎఫెక్ట్సును తీసుకొచ్చారు.

**బాక్సాఫీస్ స్టార్!**

'జమున ఈజ్ ఎ వెర్సటైల్ ఆర్టిస్టు' అండ్ 'బాక్సాఫీస్ స్టార్' అన్న మాటల్ని ప్రముఖ దర్శక, నిర్మాతలు యిటీవల నాతో అన్నప్పుడు అది అక్షరాలా నిజం అనిపించింది. (ఆమె నటించిన పాత్రల్ని బట్టిగానీ, విజయాల్ని బట్టిగానీ) జమున పాత్రను ఎన్నుకునేముందే కథను సొంతంగా



'వీరాంజనేయ'లో జ్యోతి.

విని, తనకు నచ్చినట్లయితేనే అంగీకరిస్తుంది. ఆమె ఒప్పుకున్నదా, ఆపాత్రకు ప్రాణప్రతిష్ఠ చేస్తుంది. ఒక్క సెకండులో తన ముఖకవళికల్ని మార్చుకోగల సామర్థ్యం యీమెలో వుంది. డైలాగులను సన్నివేశంయొక్క ముఖ్యత్వాన్నిబట్టి మాడ్యులేటివ్ వాయిస్‌లో చెప్తూ, ఆ పాత్రలో లీనమై నటిస్తుంది. ముఖ్యంగా శోకఘట్టాల్లో నటించడం యీమెకు మంచినీళ్ల ప్రాయంలాంటిది. ప్రస్తుతం యీమె అరడజను చిత్రాల్లో నాయిక పాత్రల్ని ధరిస్తోంది.

— శ్రీనివాస్

## ఆంధ్ర రచయిత్రుల తృతీయ మహాసభలు

ఫిబ్రవరి 3, 4, 5 తేదీల్లో తృతీయ ఆంధ్ర రచయిత్రుల మహాసభలు వరంగల్‌లో ఆహ్వానసంఘం ఆధ్వర్యాన జరుగుతాయి. ఆహ్వానసంఘం అధ్యక్షురాలు శ్రీమతి శ్యామల దేవి శ్రీనివాసన్.

మొట్టమొదటి రోజున డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సభలకు ప్రారంభోత్సవం చేస్తారు! శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ అధ్యక్షోపన్యాసం యిస్తారు. ఆంధ్ర రచయిత్రుల సమాచార సూచికని శ్రీ గోపాలరెడ్డి ఆవిష్కరిస్తారు. ఆహ్వానసంఘం సభ్యులు రచయిత్రులని సన్మానిస్తారు.

నాలుగవ తారీకు, శ్రీమతి భానుమతీ రామకృష్ణ అధ్యక్షతన గోష్ఠి కార్యక్రమం. విషయం: స్వీయరచనా వ్యాసంగము, అనుభవాలు. శ్రీమతులు ముప్పాళ రంగనాయకమ్మ, యద్దనపూడి సులోచనా రాణి, ఆనందారామం, తురగా జానకీ రాణి, వాశిరెడ్డి సీతాదేవి, వేదుల మీనాక్షి దేవి, అద్దేపల్లి వివేకానంద దేవి పాల్గొంటారు.

తృతీయసభ : శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి అధ్యక్షతన సాహితీ సదస్సు. 19 వ శతాబ్దమునుండి నేటివరకూ స్త్రీ రచనల సమీక్ష. శ్రీమతి నాయని కృష్ణకుమారి 'కథ–నవల' గురించి ప్రసంగం. శ్రీమతి పి. యశోదారెడ్డి–కవిత, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి యితర ప్రక్రియలు.

అయిదవ తేదీ ఉదయం : కథా సమావేశం. శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర అధ్యక్షతన జరుగుతుంది. పాల్గొనేవారు శ్రీమతులు పవని నిర్మల ప్రభావతి, విజయలక్ష్మి రామకృష్ణన్, తురగా జానకీ రాణి, వాశిరెడ్డి సీతాదేవి, ముప్పాళ రంగనాయకమ్మ, కోమల దేవి, జి. వి. ఎస్. అచ్యుతవల్లి.

ఆ నాటి సాయంత్రం : కవితా నివేదనము. అధ్యక్షులు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ. శ్రీమతులు బుర్రా కోమలా దేవి, పిండిప్రోలు వసంతకుమారీదేవి, స్థానాపతి రుక్మిణమ్మ, నాయని కృష్ణకుమారి మొదలగువారు పాల్గొంటారు.

(ఐ. వి.)



ఆంధ్రా సిస్టర్స్‌లో ఒకరయిన బేబీ సరళ ఇందరులో అనాథ పోలీసు పిల్లల సహాయార్థం చేసిన నృత్య ప్రదర్శన సందర్భంలో తీసిన చిత్రం.

## సన్మానం

ఆంధ్రులకి సుపరిచితులైన శ్రీ పి. హెచ్. నారాయణరావుకి కాకినాడ సూర్య కళామందిరంలో డాక్టర్ ఎ. వి. ఎస్. రాజు అధ్యక్షతన ఘనంగా సన్మానం జరిగింది. సన్మాన సంఘం తరఫున అధ్యక్షులు 1500 రూపాయల పర్సుని శ్రీ నారాయణరావుకి అందజేశారు. అనేక సాంస్కృతిక సంస్థలవారు శ్రీ నారాయణరావుని పూలమాలలతో గౌరవించారు. డా. కృష్ణమూర్తి, శ్రీ వి. శ్రీహరిరావు, సన్మానితుని ప్రతిభా విశేషాల్ని గురించి ఉపన్యసించారు. తమకు జరిగిన సన్మానానికి శ్రీ నారాయణరావు కృతజ్ఞతల్ని తెలిపారు.

## పాండిచ్చేరి ఆంధ్ర మహాసభ

పాండిచ్చేరి ఆంధ్ర మహాసభవారు - ఐటివారంగస్థలనటుడు, దర్శకుడు శ్రీ బందా కనకలింగేశ్వరరావు, కూచిపూడి నాట్య విశారదుడు శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మలను లెఫ్టినెంట్ గవర్నర్ శ్రీ ఎస్. ఎల్. శిలంగారి సమక్షంలో సన్మానించారు.

(ఐ. వి.)

# పుస్తకాలు

## జాతి రత్నం

### గేయకావ్యం

రచన: డాక్టరు సి. నారాయణరెడ్డి, డెమ్మీ సైజు 112 పుటలు. మేలురకం కాగితం. వెల: సాదాప్రతి రు. 4. అట్ట బైండు రు. 5. రజా బైండు: రు. 7. ప్రకాశకులు శ్రీ ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్టణం, సికిందరాబాదు.

ఆధునికాంధ్ర విద్వత్కవి విమర్శకులలో శ్రీ నారాయణరెడ్డిగారు అగ్రస్థానాన్ని ఆక్రమించ గలవారు. నూతన రీతి గేయ కావ్య రచనలో సిద్ధహస్తులు. వీరు ఇంతవరకె 'కర్పూర వసంతరాయలు' 'నాగార్జున సాగరం' మొదలైన మధుర కావ్యాల మూలంగా తెలుగునాట గొప్ప కీర్తి ప్రతిష్ఠలు సంపాదించారు. మొదట్లో తెలంగాణా విప్లవోద్యమంలో ప్రధాన పాత్ర వహించి, తన రచనల మూలాన నిద్రపోతున్న జనాన్ని లేపి, ఉద్రేకం కలిగించి, విజయాన్ని పొందిన వీర కవిగ్రామణి! అట్టి సర్వతోముఖ ప్రజ్ఞ గల రెడ్డిగారి అమృత హస్తం నుంచి వెలువడిన కావ్యరత్నం యీ జాతి రత్నం.

ఈ జాతి రత్నం భారత జాతి రత్నమైన శ్రీ జవహర్‌లాల్ పండితుని జీవిత గాథ. భారత స్వాతంత్ర్య సమరంలో నాయకత్వాన్ని వహించి, విజయం సంపాదించిన నెహ్రూ యిందులో నాయకుడు. "తెలంగాణా విప్లవంలో పాల్గొని తన కవితా వహ్నితో ప్రజ్వలింప జేసిన యువకుడు" దీనికి కృతికర్త కావడం ఎంతో సముచితంగా ఉన్నది. ఇట్టి చరిత్ర గాథలు వ్రాయడానికి యిట్టి రచయితలే అన్నివిధాలా అర్హులు! ఈ కృతి కృతి నాయకుడికీ, కృతి కర్తకూ కూడా సుయశస్సును చేకూర్పగలిగి ఉన్నది.

"ఈ కావ్యాన్ని నారాయణ రెడ్డిగారు "నాగార్జున సాగరం" నాటినుంచి అనుసరిస్తున్న మాత్రా ఛందస్సులో వ్రాశారు. సందర్భాన్ని అనుసరించి గతులను మారుస్తూ, ఔచిత్యాన్ని పాటిస్తూ రసపోషణ చేశారు. భావపుష్టిని శ్రుతి సౌఖ్యంతో మేళవించారు. ఆంధ్ర భారతికి ఈ కావ్యం జాతి రత్నహారం" అంటూ మద్రాసు కాలేజీ ప్రధాన వ్యాయామూర్తి శ్రీ రాజమన్నారుగారి తీర్పు! ఆ తీర్పు ఎంతో న్యాయదృష్టితో చేసినదే కాని వేరు కాదు.

ఇందు పద్నాలుగు ప్రకరణాలలో పండిట్‌జీ జీవితానికి సంబంధించిన ప్రధానాంశాలు గ్రహించి గేయ రచన పొందాగ జరిగింది. ప్రతి ప్రకరణానికి ఆదిలో శ్రీ బాపు చిత్రించిన చక్కని చిత్రాలు వివరాలతో కూడా చేర్చబడినవి. ఇవి రచనకు తళుకును కూరుస్తున్నవి. వివిధ గతుల్లో నడిచిన గేయాలు సాధారణంగా మధ్యమల వ్యావహారికంలోనూ, నడుమ నడుమ గంభీరమైన గ్రాంథిక భాషలోనూ సాగి పఠితలకు ఉత్సాహాన్ని కలిగిస్తున్నవి. నూతన రీతిని ఈ గాథను పున్నంచేత చెప్పించడం మెచ్చుకో దగింది. సంగ్రహంగానైనా మైన యీ కావ్యం జవహర్జీ జీవితానికి ప్రతిబింబం!

నెహ్రూ చరిత్రను ఇదివరకే కొందరు పెద్దలూ, చిన్నలూ, పద్యంగానూ, గద్యంగానూ, గేయాలుగానూ, దృశ్యాలుగానూ వ్రాసి ఉన్నారు. కాని, దీని ప్రత్యేకత వాటిలో కానరాదు. గేయ రూపంగా వెలువడిన కావ్యాలలో ఇదే మేలయినది. జాతి రత్నాన్ని గురించి వెలువడిన యీ జాతి రత్నం కావ్యరత్నంగా గణింప బడదగినది.

ఇట్టి ఉత్తమ రచనను చక్కని చిత్రాలతో ఉత్తమోత్తమంగా ముద్రింపించి, ఆంధ్రలోకానికి అందిస్తూ ఉన్న శ్రీ శేషాచలం కంపెనీ వారి వాఙ్మయ సేవ విస్మరింప రానిది.

—బు. వేం. ర.

## అంజలి

'అంజలి' మాసపత్రిక మా కార్యాలయం చేరింది. ఇందులో ప్రముఖుల రచనలు, అన్ని పత్రికల్లో వుండే శీర్షికలూ వున్నాయి. లోపల పేజీలు, 75 పైసలు. వివరాలకు: అంజలి మాసపత్రిక, శ్రీకాకుళం. (ఆం. ప్ర.)

# మహీధరోక్తులు

### మహీధర నళినీమోహనరావు

రాసికోసిగిసి కంపైన బట్టనా
చందనమ్ము చిమ్ము సౌరభమ్ము!
సజ్జనులగు వారి చర్యలిట్లుండురా
హృదయవర్తి యీ మహీధరోక్తి.



భారతదేశం ఎంతో కష్టపడింది కాని ఆస్ట్రేలియాతో మూడవ టెస్టులో 40 పరుగులతో వోడి పోయింది. జయసింహ ఎంతో బాగా ఆడినా లాభం లేక పోయింది. అదే రోజు, జనవరి 24న వెస్టిండీస్ 'పేస్ బవులర్లు' సోబర్స్, హాల్‌లు ఇంగ్లండుతో మొదటి టెస్టులో తమ టీమ్‌కి బాగా సహాయ పడ్డారు. ట్రినిడాడ్‌లోని పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో జరిగిన మాచ్ 'డ్రా' అయింది — ఇంగ్లండ్ 568 పరుగులు తీసినప్పటికీ.

ఇంతదాకా వెస్టిండీస్‌తో ఇంగ్లండ్ చేసిన పెద్ద మొత్తం ఇదే.

వెస్టిండీస్ బవులర్లు సాధించిన పని నాకు మరొక ఉదంతం గుర్తుకి తెస్తోంది. పోయినేడు మదరాసులో జరిగిన టెస్టులో సోబర్స్ తన జట్టు వారిని అపజయంపాలు కాకుండా రక్షించాడు. అతని ప్రయత్నం వల్లనే భారత దేశానికి ప్రపంచం చాంపియన్ల మీద గెలిచే అవకాశం తప్పిపోయింది—అంటే ఒక అతిముఖ్యమయిన కాచ్ మనవారు వదిలేశారనుకోండి!

గెలుపుకి కనుచూపుమేర దూరంలో ఉండి ఆస్ట్రేలియాతో వోడి పోవటం భారత దేశానికి ఇది మూడవ సారి. దీన్ని బట్టి మనకి తెలిసేదేమిటి? పట్టుదల, దీక్షతో దేనినయినా సాధించవచ్చు; భరత్ బాట్స్‌మన్‌కి ఏకాగ్రత తక్కువ, పేస్ బవులింగంటే భయం అని.

పాటవుడి నవాబు 'టాస్' గెలిచాడు. ముందు ఫీల్డింగ్ చెయ్యాలని సరయిన నిర్ణయానికే వచ్చాడు.

స్వదేశం జట్టు 379 చేసింది. భారత్ కుంటుతూ మొదలుపెట్టి, 4 వికెట్లకి 9 పరుగులు తీసి, బ్రహ్మాండంగా కోలుకుంది! పాటవుడి, సుర్తీలు ఉజ్వలంగా ఆడి గొప్ప శతాబ్దం పూర్తిచేశారు. స్కోరుని 279కి తీసుకు వచ్చారు. సుర్తీ పుత్రచేతి ఆటగాడు, ఆల్ రవుండర్, ఈ యాత్రలో బాగా వెలిగి పోతున్నాడు.

తరవాత జయసింహ తన ప్రతాపం చూపించాడు. అతన్ని బదిలీ ఆటగానిగా తీసుకువెళ్లారు. ముందు ఎన్నుకొనని 'పెద్దల'కి మంచి గుణపాఠం నేర్పాడు. మొదటి ఇన్నింగ్సులో 74 వేశాడు, మళ్లీ ఈ మాచ్‌లో కెల్లా ఏకయిక శతాబ్దాన్ని సాధించాడు కూడా. అతని ముందువారు గనుక ఇంకొంచెం బాగా ఆడిఉంటే మన దేశం గెలిచి ఉండవచ్చుకదా!

ప్రసన్న నిశితమయిన బవులింగ్‌తో ఆస్ట్రేలియాని 294 తో ఆపేశాడు, రెండవ ఇన్నింగులో 6 వికెట్లు దోచుకున్నాడు!

సుర్తీ (64), పాటవుడి (48) ముందే తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నారు; బోర్డె మళ్లీ విజృంభించి 63 కొట్టాడు. కాని, మిగిలినవారు నిలబడలేకపోయారు. ఇండియా వోడి పోయింది.

* * *

ఇంగ్లండు 568 సింహస్వరూపం దాలిచింది. (గ్రావినా, బారింగటన్‌లు ఇద్దరూ వందలుకొట్టారు) వెస్టిండీస్ మొదటి అంకంలో 363 వేసి, ఫాలో ఆన్‌చేసి 8 కి 243 కొట్టారు. లాయడ్, కన్హాయి చక్కగా బాట్ చేశారు. హాల్, సోబర్స్. 6 వ వికెటుకి బాగా నిలబడ్డారు.

* * *

ఇక ఇంటిదగ్గిర. చేపాక్‌లో జరిగిన రంజీట్రాఫీలో మదరాసు మధ్యప్రదేశ్‌ని వోడించి సెమీ—ఫయినల్సుకి వచ్చింది. 279 పరుగుల తేడాతో గెలిచింది! స్కిప్పర్ పి. కె. బెల్లియప్ప. కె. ఆర్. రాజగోపాల్ ఇద్దరూ శతాబ్దాలు సాధించారు. ఇద్దరూ 141, 154లతో తమకి తామే కొత్త రికార్డులు సృష్టించుకున్నారు.

ఈ సీసన్‌కి ఇది రాజగోపాల్ మూడవ సెంచరీ. 5 మాచీలలో 616 పరుగులు చేశాడు! ఇతన్నీ, ఎస్. వెంకటరాఘవన్‌నీ ఆస్ట్రేలియా యాత్రకి ఎన్నుకొనక పోవటంలో అధికారులు ఎంత పొరపాటు చేశారో ఫలితాలే తెలుపుతున్నాయి. వెంకటరాఘవన్ 35 కి 6 వికెట్లు తీశాడు! మ. ప్ర. జట్టు 190 కి 3 ఉండగా అమాంతం కూలి పోయింది, ఇతని ప్రభావంవల్ల! నాజర్ హుస్సెయిన్ మంచి స్పిన్ బవులర్. ఈ మాచ్‌లో మొత్తం 10 వికెట్లని పడగొట్టాడు. ఫిబ్రవరి 1 న మదరాసు సర్వీసెస్‌తో ఆడుతుంది ఫయినల్సుని. (చేపాక్‌లోనే.)

* * *

రష్యానుంచి వచ్చిన మెట్రివెలీ, మిస్ ఇవానోవాలు బొంబాయిలో మళ్లీ టెన్నిస్ మగ, ఆడ పోటీలని గెలుచుకున్నారు. మగవారిలో టిరియాక్ (రుమేనియా), ఆడవారిలో మిస్. ఎస్. వసంత్ (ఇండియా) ఫయినల్సుకి వచ్చారు. మన డేవిస్‌కప్ ఆటగాళ్లు లాల్, ముఖర్జీలు సెమీ ఫయినల్సుదాకా రాగలిగారు. డబుల్సుని టిరియాక్, నస్టాసెలతో వోడి పోయారు, మొదటి రెండు సెట్లూ గెలుచుకున్న తరవాత....

ఇక జూనియర్సు బిరుదుని ఆనంద్ అమృతరాజ్ కొట్టేశాడు. మిశ్రాని వోడించాడు. కాని మిశ్రా, మీనన్లు ఇద్దరూ డబుల్సులో ఆనంద్, అతని తమ్ముడు విజయ్‌లని వోడించారు.

—కె. ఎస్. నరసింహన్

Editas. Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.







